చెప్పనక్కఱలేదు. పూర్వోక్తములయిన గ్రంథద్వయమునుండియుఁ గొన్నిపద్యము నుదాహరించి కవిచరిత్రము నింతటితో ముగించుచున్నాము.—

సుభాషిత రత్నావళి.

చ. నతులకుచు న్మహోన్నతిఁ దనర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుం బరజనప్రియకార్యసమర్థతన్ సమం
చితనిజకార్యసంగ్రహము చేయుచు నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం బరఁగుధీరులు పూజ్యులు గారె లోకికిన్.—నీతిశతకము

ఉ. అతివలఁ జూచి వీరబలలంచు వచించుమహాకవీంద్రులు
ద్ధతవిపరీతవాదు లిది దబ్బఱ గాదు విలాసినీసమం
చితతరశక్తిపాతములచే గెలువంబడి రింద్రముఖ్యులున్
ధృతి నటువంటివా రబల లేగతి నైరి తలంచిచూడఁగన్.—శృంగారశతకము

చ. కడు వెఱపించుచు న్ముదిమి గద్దఱిబెబ్బులిమాడ్కి నున్న దె
క్కుడుపగదాయలంబలెఁ దెగుళ్ళు శరీరము నొంచుచున్న వె
ప్పుడొ చను భిన్నకుంభజలమట్టుల నాయువు నిట్టు లయ్యుఁ దా
రుడుగక మానవు ల్దురితమోలి నొనర్చుచు నున్నవా రహో—వైరాగ్యశతకము

రామవిలాసము.

ఉ. వాసవనీలనీలరుచు లత్యతివిభ్రమశీలకముల్ మరం
దాసవలోలముల్ యువతధూవకనూతకదంబపుండ్రకాం
డాసనముక్తలోహగుళికాళికరాళము లంజనప్రభా
భాసురభృంగజాలములు బంధురవృత్తిఁ జెలంగెఁ గానలన్.—ఆ. ౧

శా. రామా రాజలలామ యోగిహృదయారామా మహాభోగసు
త్రామా నా కొకముద్దుపెట్టుమువు రారా యంచుఁ గౌసల్య సు
ప్రేమం బిల్చిన ముద్దులందెలు గంభీరంబుగా మ్రోయఁగా
శ్రీమంతుం డట రానిరేక మెఱయం జేరంగవచ్చుం గృపన్.—ఆ. ౨.

చ. కటుభట ఘోషగర్జితము ఖాడ్గికపాణినటత్కృపాణరు
క్తటిదుదయంబు చిత్రఘటితధ్వజపంక్తిసురేంద్రచాప ము
ద్భటవివిధప్రతాపరవిబాధక ముగ్రనిశాటవాహినీ
పటుఘనబృంద మయ్యెడ నభంబునఁ బర్వె నసృక్ప్రవర్షియై.—ఆ. ౩.

ఉ. చంపకపుష్పవాసనలసార మెఱింగిన షట్పదంబు లీ
సొంపగు కన్నెపెన్నెరులు చూచితిరే చెలులార యంచు భా

షింపుచుఁ గింశుకావళుల శోభిత మొప్పఁ దలంచె వేడుకన్
సంపఁగినూనెచేత నొకశారదచంద్రనిభాస్య సీతకున్. — ఆ. ౪.

ఉ. ఇందు మెలంగుభృంగములు నిచ్చటికీరమయూరశారికా
బృందము లిందుఁ గల్గు సురభిప్రసవంబులు సాధనంబులై
ముందు లభించినన్ హరునిఁ బూనిజయింపఁడె మారుఁ డంచు నె
న్నందగి రాముకేళిభవనప్రమదావనవాటి వాటిలున్. — ఆ. ౫.

## నెల్లూరి - వీరరాఘవకవి.

ఇతఁడు యాదవరాఘవపాండవీయ మను నాలుగాశ్వాసముల త్ర్యర్థికావ్యమును రచియించెను. ఇందు శ్రీకృష్ణునియొక్కయు శ్రీరామునియొక్కయు పాండవులయొక్కయు కథలు ప్రతిపద్యమునకును మూడర్థములు వచ్చునట్లుగాఁ జెప్పఁబడినవి. వర్ణనాంశములయందుమాత్రము కొన్ని యేకార్థపద్యము లుండును. ఈకవి యారువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఇతని పూర్వుల యింటిపేరు మొదట దేశరాజువారయినను నెల్లూరియందు వాసము చేయుచుండుటచే నెల్లూరివారని మాఱినది. ఈతఁడు కాశ్యపగోత్రుడు; ఆపస్తంబసూత్రుఁడు; వేంకటపతిపుత్రుఁడు. ఈతఁడు తనతాతతాత యైనకొండనమంత్రిని దనగ్రంథమునం దిట్లు వర్ణించియున్నాఁడు—

సీ. ఎవ్వనితండ్రిపేటల దేశరాజువా రన నింటిపేరు మున్నమరఁ దెచ్చె
నెవ్వనిసద్విద్య హెచ్చుగా వీణవా రన నింటిపేరు ము న్నమరఁ గూర్చె
నెవ్వనికొమరుఁ డీయిలఁ బెద్దవేంకటపతిరాయలకు దళవాయి యయ్యె
నెవ్వఁడు గీతసాహిత్యవిద్యలనేర్చి దిగ్విజయంబునఁ దేజరిల్లె
నెవఁడు ఘణిణమలహరియు ధవళశంఖ । మాదిగా బిరుదులనెల్ల నంది మించెఁ
బ్రౌఢరాజులచేనిమ్మపండనంగ । నతఁడు మతికెక్కఁ గొండలార్యుఁడు జగతి.

తిరుమలదేవరాయనిపుత్రుఁ డయిన యీపెదవేంకటపతిరాయలు ౧౬౧౫ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసెను. కవియొక్క ప్రపితామహుఁ డాతనికాలములో నున్నందున, నాలుగుతరముల తరువాతివాఁ డయినకవి ౧౭౧౫ వ సంవత్సరప్రాంతముల యందుండి యుండవలెను. కవి తనశక్తి సామర్థ్యాదులను గూర్చి యాదవరాఘవపాండవీయావతారికయం దిట్లు వ్రాసికొనియున్నాఁడు—

సీ. సకలమంత్రరహస్యశాస్త్రసర్వంకషప్రజ్ఞాధికస్ఫూర్తిఁ బరిఢవిల్లి
నఖిలయోగరహస్యనిరుపమశ్రీసుధోరుశాంభవయోగాభ్యాసశక్తిమీఱి
యాగమాంతరహస్యభాగోపనిషదర్థసర్వస్వవిజ్ఞానసారమెఱిఁగి
నాటకాలంకారనానావిధవిశేషరసభావభేదము ల్వాసిగాఁ దెలిసి
శబ్దముఖ్యశాస్త్రసదసద్వివేకత । స్మృతిపురాణవాస్తుకృతిరహస్య
గణితతురగరత్నగజపరిజ్ఞానత । నమరు వీరరాఘవాఖ్యకవిని.

క. నానావిధావధానము । లానృపనీతియును భరతమహాత్మ్యాదుల్
మానుగ నిచ్ఛాలిపియున్ । మానితముగఁ గల్గుఁ గోపనంబులు మఱియున్.

క. ప్రాకృతముఖషడ్భాషల । వ్యాకరణంబులును దెలుఁగువ్యాకరణంబుల్
ప్రాకటసాముద్రికము । లీకున్ జ్యోతిషముఁ జాపవిద్యావిధమున్.

క. సాంగముగఁ దెలిసి మును యో । గాంగీకారమతి నిశ్చలానుభవాప్తిన్
బొంగియు నియోగవృత్తిఁ బో । సంగి చెలంగితిని సారసాహిత్యనిధిన్.

సీ. శతలేఖినీపద్యసంధానచాతురి ఘటికాశతగ్రంథకరణపటిమ
ఆశుప్రబంధబంధాదిక్రియారూఢి సంకరోష్ఠ్యనిరోష్ఠ్యచాటుకలన
విస్తరమాఘమాఘ్యవివిధచిత్రస్ఫూర్తి పాదమాత్రప్రతిపాదఘటన
వ్యస్తాక్షరవిమిశ్రబహుపద్యగుంభన మచలజిహ్వాదికప్రచురరచన
బహుజనమనోంతరస్థిరబహువిధార్థ । బహుసమస్యాప్రపూర్తియు బహువిభేద
సకలభాషాసమస్యాదిసంవిధాన । మమరఁగూర్తును వీరరాఘవాఖ్యకవిని.

క. పంచాశచ్చాటుకథా । చంచత్కృతులను రచించి సత్కవిరాజా
సంచితకీర్తిని దగు సా । ధ్వంచితుఁడను వీరరాఘవాఖ్యనియోగిన్.

చ. అపుడనఁగా వ్యసంక్తి పదియర్థములన్ రచియింపనేర్తు స
త్కృతులదయున్ శిరీషకవితామృతతామహితార్యవైఖరిన్
భువి నటులైన సత్కథల మాటికొనర్తును బాలబోధకై
తివిరి బహుత్వమందు నలత్రితయము పర్యవసాన మాటచేన్.

కవి తాను చెప్పుకొన్నట్లు స్వసామర్థ్యము నంతను జూపి పదియర్థముల గ్రంథమును రచియింపక మూఁడర్థములదానినే రచియించినను, ఇట్టి గ్రంథములయందు నిఘంటువులు వెదకి పదముల నేర్చి కూర్చిన శిల్పప్రౌఢిమయే కాని యర్థచమత్కారము కాని భావగౌరవముకాని రసపుష్టికాని పుట్టదు. యాదవరాఘవపాండవీయము లోని కొన్ని పద్యము లిందు క్రిందఁ జూపఁబడుచున్నవి—

శా. వాతెం దెచ్చిన మాళవానియును దుర్వ్యాపారబాధాగతుల్
చేరఁగా రా విటు వేయుమాఱిది యిదే సేవింతు వీక్షింపు మా
త్మానూనవ్యథఁ బాపు నాహృదయశల్యంబుం బ్రయత్నంబు బాపవే
స్వారాజ్యస్థితి నిల్పఁ జేయఁగల భవ్యస్వీకృతిం బోయెదన్.—ఆ. ౧.

మ. అసురారాతిధరాత్రభీతికలకంఠారంభతన్ బాలకా
ర్యవిహారాధ్వప్రవృత్తి మెలంగఁ దెల్పఁగను విశ్వామిత్రమౌనీశుమా
నస ముప్పొంగ నమూనమై యొగి సనానందక్రియల్ వెంపనా
నిసహజంబులు నిండ్లలో నిలువఁ బూనెం గామచారోన్నతుల్.—ఆ. ౨.

ఉ. కౌతుకమాత్మ జేర్పడఁ దగన్ జనకీశమహాబలాప్తివి
ఖ్యాతచరిత్రు సింహబలుఁ గన్గొని యీవిధ మెల్లఁ దెల్పి సం
ప్రీతిగ రాము నీకడకు వేగమె తెత్తునటంచుఁ దత్సమా
హూతి సుదృక్శిరోమణిఁ దదుక్తిని గైకొని పోయి యచ్చటన్.—ఆ. ౩.

చ. హరివిభుఁ డంతకీర్తి నుత సాంబసమాఖ్యుఁడు వైరికర్షి
కస్వనిజనాముఁ డాబలుఁడు గావఁగఁ బూని తదగ్రయాయియై
మందమి వేగ నచ్చటి కమందధృతిన్ జని యోగలంకలోఁ
జొరఁబడి కాల్ప సైన్యములఁ జూర్ణముచేసెను వాఁ డదన్నతిన్.—ఆ. ౪.



## నంజరాజు.



ఈకవి హాలాస్యమాహాత్మ్యము నెబ్బదిరెండధ్యాయముల వచనకావ్యముగ రచియించెను. ఈగ్రంథమున నధ్యాయాద్యంతములయందుఁ బద్యములుగలవు. కవి వంశవర్ణనమును బద్యములతోనే చేయఁబడినది. ఈకవి మహీశూరరాజగు దొడ్డమహీపాలునిపౌత్రుఁడును, వీరరాజభూపాలుని పుత్రుఁడు. ఈదొడ్డభూపాలుఁడు ౧౬౭౦ వ సంవత్సర ప్రాంతములయందుండినవాఁడు. కవితానును దనయన్నయు మహీశూర రాజ్య సేనాధిపతులమని చెప్పుకొనియున్నాఁడు. కవి యన్నయగుదేవభూవిభుఁ డిట్లు వర్ణింపఁబడెను.—

శా. శ్రీగ్రామణపరాయణుం డగుచు నెంతే విశ్రుతుం డైనయా
సేనాధీశ్వరదేవభూవిభుఁడు కాశింఖానమాద్యద్బలా

ఖానాద్యుద్భటయావనాధిపుల సంగ్రామంబునం గూల్చి ఢి
ల్లీనాథాదుల కెల్ల నచ్చెరువు గొల్పెం ధారుణీమండలిన్.

౧౭౩౧వ సంవత్సరమునందు మైసూరు రాజగు చామరాజును సింహాసనవిహీనుని జేసి చెఱసాలయందుఁ బెట్టించినవాఁడు దళవాయియైన యీదేవభూవిభుఁడే. కవి ౧౭౩౦ సంవత్సర ప్రాంతములయందుండినవాఁడు. ఇతఁడు క్షత్రియవంశజుఁడు; భారద్వాజ గోత్రుఁడు; ఋక్శాఖవాఁడు. ఈ హాలాస్యమాహాత్మ్యము దక్షిణమధురాపురీమాహాత్మ్యమును దెలిపెడి శైవగ్రంథము. ఇందలికథ స్కాందపురాణమునుండి గైకొనఁబడినది. పదునెనిమిదవ శతాబ్దారంభమున మధురలోను మైసూరులోను దరుచుగఁ గొన్ని వచనకావ్యములు చేయఁబడినవి. ఈహాలాస్యమాహాత్మ్యముయొక్క రచన సలక్షణమయి నాతికఠినముగానున్నది. ఆకాలపు వచనరచనయొక్క రీతిని జూపుటకయి హాలాస్యమాహాత్మ్యములోని కొన్ని పంక్తుల నిందుఁ బ్రదర్శించుచున్నాను.—

"వ. రూపలావణ్యభాగ్యంబువల్లనో యనువైనగోత్రంబు గలవాఁ డనియో విద్యం జూచియో సుందరేశ్వరుం డనుబుద్ధిచేతనో లేక భ్రాంతిచేతనో నేనునేను బిడ్డ నిచ్చుట యనుచుం బలికి యాబ్రహ్మచారిం గులగోత్రంబు లడుగ నతండు తనగోత్రంబును సూత్రంబును నక్షత్రంబును నూర్ధ్వపుండ్రంబును గ్రమంబుగా విస్మితుండై యెఱింగించుటయు నబ్బాంధవులు కులగోత్రవ్యత్యాసంబులు లేకుండుటకు సంతసించి యూర్ధ్వపుండ్రధారణంబున కొక్కింత ఖేదంబుఁ జెంది యనేకమ్ములగుణమ్ములయం దొకదోషంబు గలిగియుండినం గాని యడంగు నని నిశ్చయించినవారై వివాహంబు లొనరింప నవ్విరూపాక్షుం డైశ్వర్యయుక్తుం డగుటం జేసి పుత్రిక కధికంబుగా ద్రవ్యం బొసంగ నయ్యుర్వీసురనందనుండు సంతుష్టుండై యాధనం బంతయుం గైకొని పత్నీసమేతంబుగాఁ బెక్కండ్రు బంధువులతోడఁ గూడుకొనియున్న తల్లిదండ్రుల సమీపంబునకుం జనుదేర దేశాంతరంబున కరిగి వివాహంబు చేసికొని భార్యతోడం జనుదెంచిన కుమారుం గాంచి తండ్రియుం దదీయబాంధవులు నత్యంతసంతోషం బొందిరి &c."—

## కోటి వెంకనార్యుఁడు.

ఇతఁడు "ఆంధ్రభాషార్ణవము" అను పేరు గల మంచియచ్చతెలుఁగునిఘంటువును పద్యములుగాఁ జేసెను. దీనితో సమాన మైనయచ్చతెనుఁగునిఘంటువు మఱి

యొకటి లేదు. ఈకవి యీపుస్తకమును శ్రీవిజయరఘునాథునిపుత్రుఁడైనరఘునాథ రాజు ప్రేరణముచేతఁ జేసి యాతని కంకితము చేసెను. ఈరఘునాథరాజు గాయనాథ సేతుపతి యయినవిజయరఘునాథరాజుకుమారుఁ డని తోఁచుచున్నది. అట్లయిన పక్షమున రఘునాథరాజు ౧౭౩౮వ సంవత్సరము మొదలు ౧౭౮౭వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినందునఁ గవియు నాకాలమునం దుండియుండవలెను. కవి గద్యము నందుఁ దనబిరుదావళి నీప్రకారముగా వ్రాసికొనియున్నాఁడు.—

„ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త సర్వజ్ఞత్వాది కతిపయగుణ స్వసామ్యతదితరసకలగుణనిరూప మ్యాసేతుహిమాచలఖ్యాత మహోద్దండ కవిబిరుదప్రశస్త సీతారామార్యవర్యతనూజాత శౌర్యధైర్యస్థైర్యాది సకల గుణచిరత్నరత్నాకర కోటిసమాఖ్యవంశసుధాపయోధిరాకాశశాంక ఘుటికా తురంగ నీలాతపత్ర హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప నవవిధ భేరికాది నిఖిల బిరుదాంక బృహదంబికాకటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబం ధుర కర్ణాటపాండ్యచోళమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథమహీ నాథసభాంకణ బిరుదాయమానార్యనుతచర్య వెంకనార్యప్రణీతం బైన &c.”

కవితాధోరణిని జూపుటకయి నిఘంటువునుండి పద్యముల నుదాహరించుట యుచితము కాదుకావునఁ గృతిపతిని వర్ణించినపద్యము నొకదాని నిం దుదాహరించుచున్నాను.—

ఉ. శ్రీరఘునాథరాయ నృపశేఖర నీదుకరాసి భీమకా
ళోరగతుల్య మాటను రణోర్విని దుర్మదమత్తచిత్తులౌ
వీరులప్రాణవాయువులఁ బీల్చుట యుక్తమి దెంతవింత య
య్యారె సముద్రమయ్యు నిసుమంతయు భంగము గాంచ దెప్పుడున్.



## అడిదము సూరకవి.



ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; అడిదము బాలభాస్కరునిపుత్రుఁడు. ఈయడిదము బాలభాస్కరుఁడు శుద్ధాంధ్రరామాయణమును రచించినట్లు కవిజనరంజనములో సూరకవి వేసికొన్న

„శుద్ధాంధ్రరామాయణ ఘటనవైదుష్యధురంధ రాడిదము
బాలభాస్కరతనూభవ”

అను గద్యములవలనను, కవి సంశయవిచ్ఛేదములో బాలభాస్కరుని శుద్ధాంధ్రరామాయణములోని దని యుదాహరించిన

«..గి చిగురువైపుల న్వాదల నేటయినీటఁగవిటికోటు»

అను చంపకమాలికాపాదమువలనను దెలియవచ్చుచున్నదిగాని యీశుద్ధాంధ్రరామాయణ మిప్పు డెచ్చటను గానరాదు. ఈసూరకవి తాను జేసినగ్రంథముల నన్నిటిని రామచంద్రపుర రామలింగేశ్వరుని కంకితము చేసెను. ఇతఁడు చేసినగ్రంథములలో నెల్లఁ జంద్రమతీపరిణయ మను నామాంతరము గలకవిజనరంజనము మిక్కిలి మనోహర మైనది. ఇది మూఁడాశ్వాసములు గల చిన్నప్రబంధ మైనను, దీనియందలి గుణసంపదను బట్టి పండితులు దీనిని పిల్ల వసుచరిత్ర మని వాడుచున్నారు. ఇతఁడు చేసిన యితరగ్రంథములు రామలింగేశ్వరశతకము, కవి సంశయవిచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకము, ఆంధ్రనామశేషము, అనునవి. కవిసంశయవిచ్ఛేద మనునది మూఁడాశ్వాసముల చిన్న లక్షణగ్రంథము. ఆంధ్రనామశేషము పైడిపాటి లక్ష్మణకవికృత మైనయాంధ్రనామసంగ్రహములో లేనియచ్చతెలుఁగుపదముల నేర్చి కూర్చినపద్యరూప మగు చిన్న నిఘంటువు. కవి తనగ్రంథముల నన్నిటిని దేవాంకితములు చేయుటచేత వానినిబట్టి కవికాలమును నిర్ణయించుట శక్యము కాదు. ఇతనిచే రచియింపఁబడినగ్రంథములనుబట్టి కవి గోదావరిమండలములోనివాఁ డయినట్టు కనఁబడుచున్నాఁడుగాని యితఁడు విజయనగరసంస్థానములో శ్రీపూసపాటి విజయరామరాజుగారికాలములో నుండినట్టు తద్రచితము లయిన చాటుపద్యములు మొదలయినవానివలనఁ దెలియవచ్చుచున్నది. విజయనగరసంస్థానప్రభువులలో విజయరామరాజు లిద్ద ఱున్నందున నితఁ డేవిజయరామరాజుకాలములో నుండినవాఁడో నిశ్చయింప శక్యముకాకున్నది. పెద్దాపురములో వత్సవాయ తిమ్మజగపతి మహారాజుగారు రాజ్యము చేయుచున్నకాలములో నీకవి తనప్రభువువెంట పెద్దాపురసంస్థానమునకు వచ్చి రాజు లందఱును సభ చేసి కూరుచుండియుండఁగా

ఉ. రాజు కళంకమూర్తి రతిరాజు శరీరవిహీనుఁ డంబికా
రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతరసీమవర్తి వి
భ్రాజితపూసపాటి విజయరామనృపాలుఁడె రాజుగాక యీ
రాజులు రాజులే పెనురాజులుగాక ధరాతలంబునన్.

ఈపద్యమును సభలో నాసీను లయియున్నరాజులవంకఁ జూచుచు లేచి చదివె నియు, అందుమీఁద నిందలి కడపటివాక్యము తమ్ముద్దేశించి పలికినట్లు భావించి రాజులందఱును కవిని కోపదృష్టితోఁ జూచుచు లేఁబోఁగా నతఁడు జంకక పద్యార్థమును చెప్పి «యీరాజులనఁగాఁ» పై చరణములయందుఁ జెప్పఁబడినరాజు లొండలయిన

సీతారామచంద్రరాజుగారు మరికొన్ని తాలూకాలను కూడ కవులునకు పుచ్చుకొని, పర్లాకిమిడి సంస్థానాధిపతియైన గజపతిదేవులతో మైత్రిసంపాదించి, ౧౫౫ గజ్జల రాహుతులతోను ౭౫౦ కాల్బలముతోను పోట్నూరు జయించి కళింగరాజని పేరుబడసి యాయూరు నివాస మేర్పఱచుకొని ప్రబలుఁడయియుండెను. ఈయన యనంతరము ఆనందరాజుగారు పరిపాలనమునకు వచ్చిరి. ఈయన పుత్రులు విజయరామరాజు గారు బహు ప్రసిద్ధపురుషులు. ఈయన మన్నెదొరలను గెలిచి వారి దేశము లాక్రమించుకొని మన్నెసుల్తాను బిరుదంది, పోట్నూరునుండి తనపేరట విజయనగరమను పేరఁబరఁగిన యూరికి రాజధానిని మార్చుకొని, ౧౭౧౨వ సంవత్సరమునకు సరియైన విజయసంవత్సర విజయదశమి జయవారమునాఁడు కోటకట్టుటకు శంకుస్థాపనము చేసెను. ౧౭౫౩ వ సంవత్సరమున నిజాము కొండపల్లి యేలూరు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులను ఫ్రెంచివారి కిచ్చెను. అప్పుడు విజయరామరాజుగారు శ్రీకాకుళమునకు నాయిబయిన జాఫరల్లీతోఁ జేరి దేశము ఫ్రెంచివారికి స్వాధీనము కాకుండునట్లు చేయుటకయి ప్రయత్నించెనుగాని, వారు రాజమహేంద్రవరము శ్రీకాకుళపు సర్కారులను తక్కువసిస్తునకు కవులున కిచ్చెదమన్నందున జాఫరల్లీని విడిచి ఫ్రెంచివారితోఁ జేరెను. తరువాత సర్కారులలోని రాజులందఱును ఫ్రెంచివారికి లోఁబడక తిరుగఁబడినప్పుడుసహితము ఈయన వారియెడల విశ్వాసముగలవాఁడయియుండి ౧౭౫౪వ సంవత్సరమున ఫ్రెంచి సేనానాయకుఁడయిన బుస్సీకి కావలసినధనమును రహస్యముగాఁ బంపెను. తరువాత బుస్సీ సేనలతో దేశమును స్వాధీనము చేసికొనుటకు కళింగదేశమునకు వచ్చినప్పు డీయన బొబ్బిలివారితోడి తనపూర్వవైరమును సాధించుకొనుటకయి బుస్సీని పురికొల్పి యుద్ధముచేయునట్లుచేసి తానును సేనలతోఁ బోయి ౧౭౫౭ వ సంవత్సరము జనేవరు నెల ౨౪వ తేదిని తాండ్ర పాపయ్యచేఁ బొడువఁబడి పరమపదము నొందెను. తరువాత విజయరామరాజుగారి పితృవ్యపుత్రుఁడగు ఆనంద గజపతిరాజుగారు సింహాసనమునకువచ్చి, బుస్సీ విజయరామరాజు యెడలఁ జూపిన యాదరమును తనయెడలఁ జూపకపోవుటచేత మనసులో ద్వేషము పెట్టుకొని బుస్సీ విశాఖపట్టణము మొదలయిన స్థానముల నన్నిటిని స్వాధీనము చేసికొని పైయధికారులయుత్తరువు ననుసరించి యీదేశమును విడిచి కర్ణాటకమునకు వెడలిపోఁగానే సేనలను గూర్చుకొనిపోయి విశాఖపట్టణమును పట్టుకొని దాని నింగ్లీషువారికి వశపఱచెదనని యుత్తరములువ్రాసి ౧౭౫౮ వ సంవత్సరమున వారితో స్నేహము చేసికొనెను. తరువాత నతఁడు ఫ్రెంచివారి నుత్తరపుసర్కారులనుండి తఱిమివేయు ప్రయత్నములో నింగ్లీషువారితోఁ జేరి, దొరకినకొల్లలోఁ దనకు భాగ మిచ్చునట్లును

జయించిన దేశములో నదీ సముద్రతీరపట్టణములును వాని చుట్టుపట్లఁగల దేశమును దక్క మిగిలిన భాగమును దన పాలనములో నుంచునట్లును యుద్ధవ్యయములక్రింద దాను నెల కేఁబదివేలరూపాయులచొప్పున నిచ్చునట్లును ఏర్పాటుచుకొని, కర్నల్ ఫోర్డు గారిచే నడుపఁబడుచుండిన యింగ్లీషుసేనతోఁ దనసేనను జేర్చి దండయాత్ర వెడలెను. అవలకే ఫ్రెంచిసేనానాయకుఁడయిన కన్ ఫ్లాన్సుగా రానందగజపతిరాజుగారిని జయించుటకయి దండయాత్ర వెడలి యింగ్లీషుసేన యాయనతోఁ జేరినదని విని రాజమహేంద్రవరమున నిలిచిపోయెను. కర్నల్ ఫోర్డుగా రానందరాజుగారు వెంటరాఁగా రాజమహేంద్రవరమునకువచ్చి ఫ్రెంచిసేనాధిపతియైన కన్ ఫ్లాన్సుగారి నక్కడనుండి పాఱఁద్రోలి, మచిలీబందరునకుఁబోయి దానిని స్వాధీనపఱుచుకొనెను. దండువెడలి యున్న యింగ్లీషువారిని జయించుటకై నిజాము సలాబత్ జంగు మచిలీబందరుకు ౧౫ మైళ్ళదూరమువఱకునువచ్చి వారిని జయించుట సాధ్యముకాదని తెలిసికొని ౧౭౫౯ వ సంవత్సరము మేయి నెల ౧౪ వ తేదిని సంధిచేసికొని మచిలీబందరు సర్కారును గొండవీడు నైజాముపట్టణము సర్కారులును ఇంగ్లీషువారి కిచ్చివేసి, ఆనందగజపతి రాజుగారు ఫ్రెంచివారి కియ్యఁబడిన దేశమునుండి గ్రహించిన సొమ్ము విషయమయి యగవుపెట్టక విడిచిపెట్టి వారితండ్రి తాతలనుండి వా రనుభవించుచుండిన దేశమును వా రనుభవించుట కంగీకరించెను. ఈయొడంబడిక యయినతరువాత స్వదేశమునకు వచ్చుచు త్రోవలో రాజమహేంద్రవరమున నానందగజపతిరాజుగారు స్ఫోటకముచేత కాలధర్మమునొందిరి. అప్పు డాయనభార్య లిద్దఱును సహగమనము చేసిరఁట! తర్వాత బొబ్బిలిలో మృతులయిన విజయరామరాజుగారిభార్య చంద్రయ్యమ్మగారు సన్నిహిత జ్ఞాతియైన పూసపాటి రామభద్రరాజుగారి ద్వితీయభార్యపుత్రుఁడయిన పండ్రెండు సంవత్సరములప్రాయముగల వేంకటపతిరాజను చిన్నవానిని పెంచుకొని, ఆచిన్నవాని పేరు విజయరామరాజుగా మార్చి యాయనను పట్టాభిషిక్తుని జేసెను. ఈవిజయరామ రాజు బాలుఁ డయినందున రాజ్యాధికారము నంతను సవతియన్నగారగు సీతారామ రాజుగారు వహించి, తమ్మునకు యుక్తవయస్సు వచ్చినతరువాత సహితమధికారమునంతను తానే చెల్లించుచువచ్చెను. ఈవిజయరామరాజుగారికాలములోనే మనకవియుండినది. ఆకాలమునందు విజయనగరమువారు నిజామునకు కట్టుపన్ను రెండులక్షల తొంబదివేల యేఁబదితొమ్మిదిరూపాయలు. అయినను దేశ మస్వస్థస్థితిలోనున్నందున నిజాము తనకు రావలసిన కప్పమును తిన్నఁగాఁ గైకొనశక్తుఁడుగాక పెక్కేండ్లూరకుండుచువచ్చెను. ఈహేతువుచేతను, సీతారామరాజుగారు బలవంతులయి తమసేనలతో చిల్లరసంస్థానాధిపతుల నదిమి కప్పములు గొనుచుండుటచేతను, విజయనగరరాజ్య మాకాలమునం

వించుమించుగా స్వతంత్రరాష్ట్రముగ లెజేయుండెను. ఈసీతారామరాజుగారు బొబ్బిలి రాజయిన చిన్నరంగారావుగారిని పట్టుకొని విజయనగరములో చెఱసాలయం దుంచెను; పర్లాకిమిడిరాజగు నారాయణదేవు జగన్నాథయాత్ర పోవుట సందుచేసికొని యాతనిరాజ్యముమీఁద దండెత్తి యాత్రనుండి తిరిగివచ్చినయాతని నరసన్నపేటవద్ద నోడించి యిప్పటి గంజాముమండలములో విశేషభాగమును విజయనగరరాజ్యములోఁ జేర్చెను. తరువాత వెంటనే దండయాత్ర వెడలి సీతారామరాజుగారు మొగలితుర్రు మొదలుగు వచ్చి స్థానిక పాలకుఁడైన బాబు జడ్డీ అబ్బమూఖానును జయించి కొంతకాలము రాజమహేంద్రవరము సర్కారుతో సహిత మాక్రమించినట్లు చెప్పుదురు. ఇట్లింకను నెక్కుజయములనుబొంది మహోన్నతదశయం దుండిన యీకాలములోనే యింగ్లీషువారు నిజామువలనఁ బొందిన సనదుక్రిందఁ నుత్తరపుసర్కారులలో దమ యధికారమును జెల్లించుట కారంభించిరి. ఇంగ్లీషుకంపెనీవారితోఁ జేసికొన్న యొడంబడికనుబట్టి సంవత్సరమునకు మూడులక్షలరూపాయలు పేష్కష్ చెల్లించుటకును పర్లాకిమిడి రాజయిన నారాయణదేవువలనఁ గైకొన్న రాజ్యమును విడిచిపెట్టుటకును విజయనగరము వారొప్పుకొనిరి. ఇట్లు కొంతకాలము జరిగినతరువాత విజయనగర సంస్థానమునకు లోఁబడియున్న కొండజమీందారు లందఱును విజయనగరమువారి మీఁద తిరుగఁబడి స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించిరి. కాని, సీతారామరాజుగారన్నిటికిని దగినవాఁ డగుటచేత నింగ్లీషుసేనలను సహాయపఱచుకొని యాకొండ సంస్థానాధిపతుల నొక్కొక్కరినే జయించి కొందఱిదేశములను తమరాజ్యములోఁ గలుపుకొనియు కొందఱిని విజయనగరమునఁ జెఱసాలలోఁ బెట్టియు నందఱిని సాధించెను. ఈకలహములో ఆంధ్రపాలకొండ జమీన్దారుమాత్రము చేరలేదు. సీతారామరాజుగారిట్లు పరరాజులను జయించుటయేకాక తురకదొరలు మసీదుల కిచ్చిన భూములను పూర్వరాజులు బ్రాహ్మణుల కిచ్చిన మాన్యములనుగూడ లాగుకొని ప్రజలను సహితము క్షోభపెట్ట నారంభించెను. ఈయనపెట్టుబాధలే నూరకవిని రామలింగేశ శతకము చెప్పునట్లు చేసినవి. ఆకాలపు ప్రభువులయందు కవి కెట్టియభిప్రాయ ముండినదో కొంతవఱకు క్రిందికవితపద్యములు వెల్లడిచేయవచ్చును—

సీ. పసులుగురుకోతివెంబడి సంచరింపరే వాహనుల్ లేరె శవంబులకును
గంగిరెద్దుకు లేదె ఘనతూర్యరావముల్ కల్మి గల్గదె వారకామినులకుఁ
బులి గోవుఁ జంపి నక్కలనుబోషింపదే స్థూలకాయము లేదె దున్నలకును
బుప్పిపంటికి లేదె పుట్టంబుఁ జుట్టుట వేణుధరుం డెద్దువెంట రాఁడె
న్యాయపద్ధతినడువనియవనిపతికి నెన్ని చిన్నెలు గలిగిన నెందుకొఱకు
నరసియ్యమునఁ జూడవలయు నాయయ్య సుఖను। రామలింగేశ రామచంద్రపురవాస.

సీ. కడువింత యగుస్థూలకాయంబు గల్గుట చిత్రభూషాంబరస్థితిని గనుట
తూర్యరావంబులతోఁ జనుదెంచుట వాలవీజనసమాప్తి గనుట
శృంగవేత్రోద్ధతిఁ జేరరాకుండుట చూపఱు పదుగురు చుట్టుకొనుట
స్వనియంతవాక్యంబు విని తలయూఁచుట మౌనముద్ర వహించి మతము గనుట
గంగిరెద్దుకు మూర్ఖభూకాంతునకును। భేదమించుకయును గనిపించ దట్టి
ప్రభువు వేఁడిన సత్కవిపటిమ చెడదె। రామలింగేశ రామచంద్రపురవాస.

సీ. మాన్యంబు లియ్య సమర్థుఁ డొక్కఁడు లేఁడు మాన్యముల్చెఱుప సామంతులంద
ఱుండినయూళ్ళగో డెత్తఁగింపఁ డెవ్వఁడుఁ బండినయూళ్ళెన్నఁ బ్రభువులంద
ఱిత్తఁడు పేద యటంచు నెత్తఁగింపఁ డెవ్వఁడుఁ గలవారి సిరియెన్నఁ గలరుదారలు
తనయాలిచీఁకటితప్పెన్నఁ డెవ్వఁడు పరకాంతలంకెన్నఁ బెద్దలంద
ఱిట్టిదుష్టుల కధికార మిచ్చినట్టి। రాజు ననవలెఁ గాక దుర్జయుల ననఁగ
నేమిపనియున్న దిఁక సత్కవీంద్రులకును। రామలింగేశ రామచంద్రపురవాస.

ఇట్లుండఁగా సంస్థానమునం దుండినరాచవారందఱు నొక్కటిగాఁజేరి ౧౭౭౪ వ సంవత్సరమునందు మంత్రిత్వమునుమాని రాజకార్యసంబంధము వదలుకొనునట్లు సీతారామరాజుగారిని నిర్బంధపఱిచిరి. తనపుత్రుఁ డయిన నరసింహగజపతిరాజును స్వీకారము చేసికొని విజయరామరాజుగారి మరణానంతరమున సింహాసన మాతని కిచ్చునట్లు తమ్ముని నొడఁబఱిచి యాయన తాను మంత్రిత్వమును విడుచుట కంగీకరించెను.

విజయనగరమువారు చెల్లింపవలసిన కప్పముయొక్క మొత్తమును నిర్ణయించుటకయి కంపెనీవారి చెన్నపురిపరిపాలకుఁడు విజయరామరాజుగారిని చెన్నపురి రమ్మని కోరెను. కోరినప్రకారముగా విజయరామరాజుగారు చెన్నపురికిఁబోక ప్రయాణవ్యయములకు తనచేత సొమ్ములేదనియు, తన యన్నయైన సీతారామరాజుగారు తన్ను నాశనము చేయుటకయి తంత్రములు పన్నుచుండిన యాకాలములోఁ దాను రాజధానినివిడిచి దూరముగాఁబోవుట యుచితము కాదనియు, విశాఖపట్టణములోని యధికారులసమక్షమునఁ దాను వారు విధించెడు న్యాయమైనకప్పమున కంగీకరించెదననియు, చెప్పి తప్పించుకొనెను. అంతట చెన్నపురిపరిపాలకుఁడు సీతారామరాజుగారిని చెన్నపురికి రమ్మని కోరఁగానే యతఁడు తత్క్షణమేపోయి యక్కడివారిని వశపఱుచుకొని రాజకార్యములు చక్కఁబఱుచుకొని, విజయనగరసంస్థానమునకు తిన్న దివానుగా నేర్పాటు చేయించుకొని తనపుత్రుని స్వీకారమును స్థిరపఱిపించుకొని, మరల వచ్చెను. ఈయేర్పాటులవలన విజయరామరాజుగారు పేరునకు రాజుగా నుండినను నిజమయిన యధికారమంతయు సీతారామరాజుగారి చేతిలోనే చిక్కెను. ఈ

విధముగాను విజయరామరాజుగారు కంపెనీవారికి మొట్టపెట్టుకొనఁగా పెట్టుకొనఁగా తుదకు వారాయనను దివానుపనినుండి తొలఁగించి విజయనగరము విడుచునట్లు తరవు చేసిరి. అందుపైని సీతారామరాజుగారు విజయనగరమువిడిచి సింహాచలమునివాసముగా జేసుకొని యక్కడ కొంతకాలముండి, తరువాత మరల తమ్మునిమంచిమాటలాడి ౧౭౯౦వ సంవత్సరమునం దొకసారియు ౧౭౯౨వ సంవత్సరమం దొకసారియు మరల సంస్థానములో దివానుగాఁ బ్రవేశించి, కడపటిసారి కంపెనీవారిచే చెన్నపురికిఁ బోవున ట్లుత్తరువు చేయఁబడి నెలకయిదువేలరూపాయల యుపకారవేతనముమీఁద ౧౭౯౩వ సంవత్సరమునం దక్కడకుపోయి చేరెను. సీతారామరాజుగారి దుష్పరిపాలనము మొదలైన కారణములచేత విజయరామరాజుగారు ఋణగ్రస్తులగుటయేకాక కంపెనీవారికి కట్టవలసినకప్పమును సరిగా కట్టలేక యేఁబదిలక్షల యిరువదియైదు వేలరూపాయలవఱకును బాకిపడిరి. అందుచేత కంపెనీవారు సంస్థానమును తమపాలనమునకుఁ దీసికొని, విజయరామరాజుగారిని స్వరాజ్యమునువిడిచిపుచిలీబందరులో వాసము చేయున ట్లుత్తరువుచేసి, ఆయనకు ముప్పదివేలరూపాయ లొక్కసారిగా నొక్కమిచ్చెదమనియు నెలకు రు౧౨౦౦౦ లు వ్యయముల కిచ్చెదమనియుఁ జెప్పిరి. ఆయన స్వదేశమును విడుచుట కిష్టము లేనివారయి బందరుపురమునకుఁ బోవుమార్గమున బైలుదేఱియయిదామ క్రోసులుదూరముపోయి యక్కడనుండి పరివారముతో వెనుకఁదిరిగి పద్మనాభమునకుఁ బోయి యక్కడ నుండి తాను ప్రయాణము చేయలేకపోవుటకు సాకులు వ్రాయ నారంభించెను. విజయరామరాజుగా రక్కడ నున్నకాలములో రాచవారును నాలుగు వేల సైనికులునుబోయి యాయనను జేరిరి. కంపెనీవారి కీసంగతి తెలియఁగానే యిరువదినాలుగుగంటలకాలము గడువిచ్చి యాలోపల నతఁడుబందరుమార్గమున బైలుదేఱని పక్షమున, బలాత్కారముగాఁ బంపవలసినదని విశాఖపట్టణములోనున్న సేనానాయకున కుత్తరువుచేసిరి. పయివారి యుత్తరువును దెలియఁబఱిచి యింగ్లీషు సేనాధిపతియైన ప్రెండర్గాస్టుగారు కొంతిసేన (౭౫౦ భటుల)తో పద్మనాభమునకుఁ బోయిరి. ౧౭౯౪వ సంవత్సరము జూలయి నెల ౧౦వ తేది యుదయమున నింగ్లీషుసేనాధిపతి పద్మనాభపుకొండను జేరునప్పటికి, విజయరామరాజుగారును బంధువు లయినరాచవారును ఖడ్గపాణులయి లోఁబడక యుద్ధముచేసి వీరమరణము నొందుటకు నిశ్చయించుకొని యందఱును పద్మనాభస్వామిప్రసాదమును స్వీకరించి యుద్ధోన్ముఖులయి నిలిచి యుండిరి. నాఁడు సూర్యోదయకాలమున నింగ్లీషుసేనలకును రాజుగారి సేనలకును ముప్పావుగంటసేపు ఘోరయుద్ధము జరిగినది. అంతట రాజుగారి సేనలన్నియు చెల్లా చెదరయి పాఱిపోయినవి. రణరంగమునకుఁ బోయి చూడఁగా రణనిహతులయి వీర

ణమును నొందినవారిశరీరము లక్కడ మున్నూటతొంబదిమూడు కనఁబడినవి. రణభూమి నలంకరించిన మున్నూటతొంబదిమూటిలో నిన్నూటయేనుబది రాచవారిదేహములు. రణరంగమధ్యమునఁ బడియుండిన విజయరామరాజుగారి శవముచుట్టును కోటకట్టినట్లుగా స్వస్థానములో నున్నతస్థితిలో నుండిన యుత్తమక్షత్రియుల శవములు నలుబది గుండుదెబ్బలతోఁ బడియుండెను. ఇట్లు మరణము నొందినవారుగాక పారిపోయినవారిలో నెందఱికి గాయములు తగిలినవో తెలియలేదు. ఇంగ్లీషు సైనికులలో మృతులయినవారు పదుమువ్వురు; గాయపడినవారఱువదియొక్కరు. మున్నూరేండ్లక్రిందట బొబ్బిలికోటముందు పెద్దవిజయరామరాజుగారు హతులయినట్లే మనకవీంద్రునికాలములో నుండిన యీచిన్నవిజయరామరాజుగారు పద్మనాభకొండముందు నిహతులయిరి. మనకవికాలముతో సంబంధించినచరిత్ర మింతే. తండ్రిమరణమును విని యప్పటి కిరువదిసంవత్సరముల ప్రాయమువాఁడయిన నారాయణబాబుగారు తల్లితోఁగూడ కొండదేశమునకు పారిపోయిరి కాని, కంపెనీవారాయనను పిలిపించి దొరతన మిచ్చిరి. ఆయన పండ్రెండులక్షలవఱకును ఋణములు చేసి ౧౭౯౪వ సంవత్సరమునందు తనకు సంవత్సరమున కెనుబదివేలరూపాయలిచ్చుపద్ధతిమీఁద రాజ్యపాలనము నింగ్లీషువారి కప్పగింపఁగా వారు ౧౮౦౨వ సంవత్సరమునాఁటి కప్పులన్నియుఁ దీర్చి రాజ్యము నాయనకు మరల నిచ్చిరి. నారాయణబాబుగారు మరల నేడులక్షలరూపాయలప్పుచేసి తనకు సంవత్సరమునకు లక్షరూపాయలిచ్చు పద్ధతిమీఁద ౧౮౨౭వ సంవత్సరములో రాజ్యమును మరల నింగ్లీషువారి యధీనముచేసి కాశీయాత్రపోయి యక్కడనే వాసముచేసి ౧౮౪౫వ సంవత్సరమున దేహము చాలించిరి. మరణకాలమున కాయన యప్పు ౧౧ లక్షలకుఁ బెరిగినది. పండ్రెండుసంవత్సరములప్రాయముగల నారాయణబాబుగారి కుమారుఁడగు విజయరామగజపతిరాజుగారికి రాజ్యమిచ్చి, ఆయన కాశీనగరమును విడిచివచ్చుట కిష్టము లేనివారుగా నుండినను ౧౮౪౮వ సంవత్సరమునం దాయనను విజయనగరమునకు రప్పించిరి. ఋణముల నన్నిటిని దీర్చి ౧౮౫౨వ సంవత్సరములో ఏ ౨౧-౨౨-౨౮ల లెక్కముతో నింగ్లీషువారాయనకు రాజ్యమొప్పగించిరి. ఈవిజయరామగజపతిరాజుగారాంగ్లేయోపాధ్యాయుల శిక్షచేఁ బ్రవీణులయి సత్పరిపాలనము చేయుచు బాలికాపాఠశాలలు మొదలయిన జనోపయుక్తములగుధర్మకార్యములకొఱకు ధనమును సద్వినియోగపఱుచుచు వచ్చిరి. విశాఖపట్టణములోని వైద్యశాలకు ముప్పదివేలరూపాయల నిచ్చినందున, దొరతనమువారాయనకు ౧౮౬౪వ సంవత్సరములో "మహారాజా" యన్న బిరుదిచ్చిరి. ఈయన ౧౮౭౯వ సంవత్సరమున స్వర్గస్థులుకాఁగా ౧౮౫౦వ సంవత్సరమునందు జనించిన యీయనపుత్రులానంద

గజపతిరాజుగా రప్పటినుండి విజయనగరపరిపాలకులుగా నున్నారు. దొరతనమువా రీయనకు ౧౭౭౨వ సంవత్సరమున "మహారాజా" యన్న బిరుదము నిచ్చిరి.

సూరకవికి రేవడను గ్రామమున చెఱువుగట్టుక్రింద నొకమాన్య ముండెననియు, ఆగ్రామమును గుత్తచేసిన దంతులూరి యన్నమరాజు కవిమాన్యమునకు చెఱువునీరు పెట్టుకోనీకపోఁగా, అతఁడు ప్రభువునకు మొఱ్ఱపెట్టుకొనియు కార్యముగానక తుదకు చెఱువులో నిలుచుండి యీక్రింది నాలుగుసీసపద్యములను జెప్పఁగానే చెఱువు నాలుగువైపుల గండితెగి నీ రాతనిపొలముమీఁద పాఱెననియుఁ జెప్పెదరు—

సీ. బ్రహ్మాండభాండసంపత్తి కుక్షిని గల్గుపద్మనాభునిపదాబ్జమునఁ బుట్టి
సకలరత్నాకరస్థానమై యుప్పొంగునంబుధీశునిచరణంబు ద్రొక్కి
పరమతత్త్వజ్ఞుఁడై పరఁగుశంతనుమహీరమణువామాంకభాగమునఁ జేరి
యఖిలలోకారాధ్యుఁడై మించివిహరించుశివుజటాగ్రసీమ నిలిచి
తనరు నీవంటిధన్యకు త్తమము గాద। పూసపాటిమహాస్థానభూమియందుఁ
గాలుద్రొక్కంగ నోడుఁ జండాలుఁడైన। కదలు మిటమాఱి దివిజగంగాభవాని.

సీ. ఆదిభిక్షుం డీతఁ డని రోసి యడిగూడుకొనివచ్చి యిటనిల్వఁ గోరితొక్కొ
జగడాలచీలివై సవతితోఁ బోరాడి వీఁగివచ్చి యిచట డాఁగితొక్కొ
నిర్జరాంగన లెల్ల నీయింకు వెలిపుచ్చ మూఁబవై యిచ్చోట దూఱితొక్కొ
జీవబాపలఁ గష్టపెట్టుటకై మిన్ను దొలఁగి యిచ్చోటను నిలిచితొక్కొ
వలదు ద్విజభూమిఁ గాల్నిల్ప వసగాదు। నవ్వ నీకేల తగ దంబురాశికరుగు
నాతియుఁ నెడె కాఁడ జెపిన్న నాఁటిమగఁడు। కదలుమిటమాఱి దివిజగంగాభవాని

సీ. భాపపంబు వెల్ల భంగంబులే కాని భంగము లొలఁగు చెప్పటికి లేదు
తిరుగుచో వంకర తిరుగుడింతియుకాని తిన్నఁగాఁదిరుగుట యెన్న డెఱుఁగ
మొదని రేఖ పగిల్లమొరయుచుండుటెకాని మొదయకూరక యుంటయెఱుఁగ మెపుదు
పాలకట్టిరోసి పల్ప నగుటెకాని పలుచనిగతి మాని మెలఁగు టెఱుఁగ
మనుచు నీలోన నీవైనయవగుణంబు। లరసి లజ్జించి దివి నుండ కనుగుడిచి
నిలువునీరైన నీవిందు నిలిచితొక్కొ। కదలు మిటమాఱి దివిజ గంగాభవాని.

సీ. కృతకాద్రులాయెనా కీలాగ్రఫణిఫణానేకపూత్కారవర్తికచయము
విరిదోఁట లాయెనా కటుకకంటకకంటకాంకురవిస్ఫురితాగచయము
పువ్వుఁబాన్పు లాయెనా నవమంజులశ్వేతలవణాలవాలమౌ చవుటినేల
బొమ్మరిండ్లాయెనా భూరిభేకాండజాధారమై తరుకేదారచయము

నీకు విహరింప వసతులై నిర్వటిలెను। చిన్న పొలములు బ్రాహ్మణక్షేత్రములకు
ఘాతుకత్వంబు చేయుమనుష్యులు గలరె। కదలుమిటమాని దివిజగంగాభవాని.

కనూరకవి విషయమున నిటఁ దెలిసినసంగతు లతఁడు సమకాలికులగు కవులతోఁ బెట్టుకొన్న వివాదములును, కవులొండొరులను దిట్టుకొన్న పద్యములును దక్క మరి యేమియుఁ గానరావు. కాఁబట్టి యీ కథలనువిడిచి కవికృతగ్రంథములనుండి కొన్ని పద్యములనుమాత్ర మిం దుదాహరించుచున్నాను.—

కవిజనరంజనము.

మ. అమరద్వీపవతీపయోవిహరణప్రాంచత్సురస్త్రీల వ
జ్రమయాభ్రంకషమంటపాగ్రముల నిచ్చల్ క్రీడఁగావించుత
త్క్రమణీవారము వేఱ నేరుపఱుపన్ రా దంచుఁగా దివ్యరా
జముఖీపాళికిఁ దమ్మిచూలి యనిమేషత్వంబు గావించుటల్.—ఆ. ౧.

శా. శయ్యాబంధమున న్మురాంతకుఁడు భూపాకృతవన్మూర్తిఁ జే
నయ్యార్యారమణుండు దాల్చిరి భుజంగాధీశులన్ నీయసా
హాయ్యప్రస్ఫుటధాటి కోర్వ కనుచో నబ్జాస్యలా యొప్పువా
రయ్యా గంధసమీర ప్రోవఁ గదవయ్యా యీకురంగేక్షణన్.—ఆ. ౨.

మ. అలమన్ మైఁ బులకాంకురాళి దరహాసాంకూరము ల్కన్గవం
దొలఁకన్ ముత్యపుటొంట్లు గండయుగళిం దూఁగన్ గనత్కంకణం
బులు మ్రోయన్ భుజమధ్యసీమ రతికంపుఁబిందాళి తార్చాలుగాఁ
దలఁబ్రా లొప్పెసె లతాంగియాదలపయిన్ ధాత్రీశుఁ డత్యాదృతిన్,—ఆ. 3.

ఆంధ్రచంద్రాలోకము.

గీ. అక్రమాతిశయోక్తి ప్రఖ్యాతికెక్కు। హేతుకార్యంబులకు సహవృత్తి గల్గ—
జ్యాపరిరంభణైకదక్షత వహించె। నీశరంబులు నీశత్రునృపులతోడ.

క. ఏపారుఁ గృతులఁ బ్రతివ। స్తూపమ వాక్యములు రెంటి కొగి సమత లగన్—
తాపమున నలను నూరుఁడు। చాపంబున శూరుఁ డోరు జగతినన్యుక్తియున్.

రామలింగేశశతకమునందలి పద్యము లీవలకే కొన్ని యుదాహరింపఁబడినవి. అతని గ్రంథము లగుటచే నాంధ్రనామశేష కవిసంశయవిచ్ఛేదములనుండి కవితాధోరణి కానుటకుఁ బద్యముల నుదాహరించుట యుచితము కాకపోయినను, అందుండియు నొక్క చిన్నపద్యమును గైకొనుచున్నాను.—

క॥ వెన్నెలగాచె మంజరి। వెన్నఁ జరమాంగములకు వెలయును వేశ్యా
కన్నె లనం బర్వంబులు। కన్నులనగ లోచనములు కంఠేకాలా.—ఆంధ్రశేవ

గీ. ఎఱుకగలవారి యనుచోట నెఱుకగలరె। యిట్టివారయి యెడిచోట నిట్టి రనుగ
జేయుఁగలవారలనుచోటఁ జేయఁగలరె। యనుచు లోకప్రసిద్ధోక్తి యగును శబ్ద
కవిసంశయవిచ్ఛేదము

## మంగళగిరి – ఆనందకవి.

ఈకవి వేదాంతరసాయనమను నాలుగాశ్వాసములపద్యకావ్యమును రచియించి దానిని నిడిమామిళ్ల దాసయామాత్యుని కంకితము చేసెను. కవి క్రైస్తవమత మవలంబించిన నియోగిబ్రాహ్మణుఁడు. ఈతఁడు తిమ్మయామాత్యుని పుత్రుఁడు; ఆత్రేయగోత్రుఁడు; కవి కృతిపతి కన్నుఁగూర్చి పలికినవిధము నిట్లు చెప్పుకొన్నాఁడు—

సీ. ఒకవంక నిగమాగమోజ్జ్వలాతిశయార్థవిధివాదకౌశలశ్రీజనికాయ
మొకచాయ న్యాయశాస్త్రోదాత్తవాక్యప్రసంగకృద్విద్వత్ప్రజావితాన
మొకత్రైత సంస్కృతప్రకటాంధ్రభాషాకవిత్వప్రవీణకవిప్రకాండ
మొకచెంత సప్తస్వరోద్గీతగీతికావైచిత్రివిస్ఫురద్వైణికౌఘ
ముల్లసిల వ్రజకోష్ఠయశోపమాన। వైభవస్ఫూర్తి నొకశుభవాసరమున
మహితగుణపాళి దాసయామాత్యమౌళి। ప్రమదముప్పొంగఁ గొలువుననుండి

మ. నను సర్వేశపదాంబుజద్వయనితాంతధ్యానపారీణు భూ
రినయోపేతచరిత్రు మంగళగిరి శ్రీవంశవారాశిపూ
ర్ణనిశానాథు సుధీజనాభిహితు నానందాఖ్యు సద్గ్రంథక
ర్తృను సాహిత్యకళావిశారదుని బిల్వం బంచి పల్కెం గృపన్.

ఉ. తరుముఖసప్తసంతతుల దారత నెచ్చట నిల్ప నచ్చటన్
బరఁగు సమస్తదిక్కులకుఁ బ్రాఁకగు భావరసానుకూలవా
గ్గరిమఁ దనర్చు సత్కృతిముఖంబున దానికిఁ దారకేందు
భాస్కరులుగలంతకాల మనిశంబుఁ గరంబుఁ బ్రసిద్ధి చెల్వగున్.

ఇతఁడు ఆంధ్రకవితాగ్రగణ్యుఁ డగుట ప్రబంధకవి పేరుపెట్టి తోఁచునట్టి వేదాంత గ్రంథము గాక మతస్థాపకుఁ డయినయేసుక్రీస్తుయొక్క చరిత్రముగా నున్నది. ఈపుస్తకము నిర్దుష్టమయి మృదుమధురమై ప్రబంధరీతిమునఁ జేయఁబడియున్నది. ఇంద

ర్ణన లేశమయినను బూర్వప్రబంధములలోని వర్ణనలకుఁ దీసిపోవు. ప్రాక్
ారగా రీకావ్యము ౧౭౦౦ వ సంవత్సరప్రాంతమున రచియింపఁబడినట్లు చెప్పిరికాని,
వి కృతిపతి యయినదాసామాత్యుని సోదరుఁ డగు రాజప్పను వర్ణించుచో

మ. మని రాత్మీయదయుండు రాజపమహామంత్రీంద్రుఁ డుద్యన్మహా
మ్మదలీఖాను కృపానులబ్ధమదవన్మాతంగమాణిక్యవా
రదుకూలానికసత్కృతిం ద్రిదశవర్యస్ఫారసామ్రాజ్యల
క్ష్మీఁ దనర్చె న్నృపకోటి పేర్కొనఁగఁ బుల్చేర్పట్టణాధ్యాసియై.

ను పద్యములో నతఁడు కర్ణాటకపు నబాబగు మహమ్మదలీచేత సత్కారమును బొంది
ట్లు చెప్పియుండుటచేతను, ఈమహమ్మదలీ ౧౭౪౯ వ సంవత్సరమునఁ గాని సింహాసన
ునకు వచ్చి యుండకపోవుటచేతను, వేదాంతరసాయనము ౧౭౫౦ వ సంవత్సరమునకు
రువాతనే రచియింపఁబడినదని నిశ్చయింపవలయును. ఈకవి కూచిమంచి తిమ్మకవి
మన లయినవారికాలములోనే కృష్ణామండలమున నుండినవాఁడు. కృతినాయకుఁడు
ందరుపురములో నధికారము చేసిన ట్లీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

మ. ప్రకటారాతిచమూభయానకఘనప్రాకారఖేయంబులన్
సుకరశ్రీఁ దగుబందరాఖ్యనగరిన్ సాంపాందదీనార్థిక
ల్పకభూజం బన దాసమంత్రి మణిశుంభద్రత్నజాంబూనదా
దికవస్తుప్రకరాన్వితాయతనుఁడై ధీరుల్ ప్రశంసింపఁగన్.

వేదాంతరసాయనకృతికర్తయు కృతిభర్తయు నిరువురును క్రైస్తవమతప్రవిష్టు లైన
యోగి బ్రాహ్మణులు. వేదాంతరసాయనము యొక్క యొక్కొక్కయాశ్వాసమునుండి
యొక్కొక్కపద్యము నిందుదాహరించుచున్నాను—

చ. జగదుపకారకారకవిశాలసమస్తపదార్థకల్పకుం
డగునతఁడెం బరాత్పరు మహామహు సర్వశుభస్వభావు మ్రొ
క్కఁగఁ దగుఁగాక యాతఁడిలఁ గల్గఁగఁ జేసినవానిపూజ స
ల్పఁగ దురితంబు లంటు నని పల్కుట యొప్ప నశంకయంబుగన్.—ఆ. ౧.

చ. ఘనతరపాపపుణ్యముఖకార్యసమాచరణస్వతంత్రతన్
గొనినమనంబు మానవునకుం బొసఁగం దగు లేనిచో జగం
బున సుకృతాఘముల్ నరకమోక్షపదంబులు గల్గవం చనం
జను నుచితజ్ఞసంతతి ననుశ్రుతవాక్యవిజృంభణంబునన్.—ఆ. ౨.

చ. చని సెలయేటిముత్తెములఁ జాదనకై యమరుద్విజాలిలా కాం
చనకురువిందచందనరసాలముఖద్రుసమూహగోష్ఠనీ

ఘనతరకాయమానములఁ గ్రప్పుచు దిగ్గియులన్ లతానికే
తనముల సంచరింపుచు నతండు పరాత్పరచింతనంబునన్.—ఆ. ౩.

ఉ. వార లవార్యకౌతుకనివాసమనోంబుజులై జగజ్జనా
ధారు నయప్రచారు సముదారుని నమ్మిరియారుమారునిన్
భారపుస్త్రీవ్రమాదన విపద్దశలం బొరయించినట్టిని
ష్కారణవైరులన్ సరకుగాఁ గొనకించుక యెల్లనెక్కులన్.—ఆ. ౪.

## కనుపర్తి అబ్బయామాత్యుఁడు.

ఈకవి యారువేలనియోగిబ్రాహ్మణుఁడు; రాయన మంత్రిపుత్రుఁడు; కౌండిన్య గోత్రుఁడు. ఈతనితల్లి నరసమాంబ; అన్నయోగానందుఁడు. ఈకవి యనిరుద్ధచరిత్రము, కవిరాజమనోరంజనము, అను రెండుప్రబంధములను రచియించెను. ఇందు మొదట రచియింపఁబడిన యనిరుద్ధచరిత్రములో

ఉ. నిండుమనంబు సత్యమును నీతియు శాంతియుఁ గల్గి కీర్తిమం
తుం డయి భోగభాగ్యములతోఁ జెలువొందుచుఁ గొండవీటిభూ
మండలనాయకుల్ ప్రభుల మన్ననచేయఁగఁ బెంపుమీఱె స
త్పండితుఁ డబ్బమంత్రి కనుపర్తి పురాన్వయవార్ధి పూర్ణచం
ద్రుం డని లోకు లందఱు నెఱుంగుటకు న్నుతిచేయ నేటికిన్.

అని కవి తనతాతయైన యబ్బయ్య కొండవీటిరాజుల మన్ననఁ బొందినట్లు వ్రాసికొనెను గాని యాతనికాలమునాటికిఁ గొండవీటిరాజ్యము తురుష్కాధీన మయినది. ఈహేతువుచేతఁ గాఁబోలును కవి తాను తరువాత రచియించిన కవిరాజమనోరంజనములో

చ. సుగుణకదంబ మెల్ల నొకచోటనె కాపుర మున్నయట్లుగా
నగునని వేయినోళ్ళఁ గొనియాడుచు భూజను లెంచ ధన్యుఁడై
తగు కనుపర్తి యబ్బనకుఁ దిప్పియసాధ్వికి లచ్చమాంబకున్
బొగడిక కెక్కి రిద్దఱుసుపుత్రులు రాయన నిమ్మనామాత్యయుల్.

ఉ. వే యనవచ్చుఁ గాక నుతు వే యనపాయవదాన్యుఁడై భవం
బౌయనవద్యబుద్ధి తగు నాయనకే యనఁ గీర్తిచంద్రికల్
గాయ నయస్వగీతికలు గాయకులుఱ్వపాడ నొప్పు మా
రాయనమంత్రి మేలు బళిరాయన మూనిజనాభివంద్యుఁడై.

అను పద్యములయందుఁ దనతండ్రి తాతలు కొండవీటిరాజులయొద్దనున్నట్లు చెప్పక తనతాతకు ముత్తాతయైన బసవామాత్యుఁడుమాత్రమే కొండవీటిరాజులమంత్రియైన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పెను—

శా. శ్రీపేర్మిన్ శశివోలె బ్రహ్మకులవార్ధిం బుట్టి కొండిన్యగో
త్రాపస్తంబపవిత్రసూత్రకలితుండై రామసింహాసనా
ఖ్యోపేతస్ఫుట కొండవీటిపురరాజ్యోర్వీశ్వరు ల్మంత్రిగాఁ
జేపట్టన్ బసవప్రధానుఁ డిల మించెన్ భాగ్యసంపన్నుఁడై.

కవియొక్క తండ్రితాతలు కొండవీటిసీమలోని కనుపర్తిగ్రామమునకు కరణములని తోఁచుచున్నది. కవికి మంగళగిరిలోనున్న పానకాలరాయఁడిష్టదైవతము. మంగళగిరి కృష్ణామండలములో గుంటూరునకు సమీపమున నున్నది. అబ్బయామాత్యుఁడు పదునెనిమిదవ శతాబ్దమధ్యమున నుండినవాఁడు. ఇతఁడు ౧౭౮౦ వ సంవత్సర ప్రాంతము వఱకును జీవించియుండవచ్చును. ఇతఁ డాశతాబ్దమునం దుండిన ప్రబంధకవీశ్వరు లందఱిలోను మిక్కిలి ప్రౌఢుఁడు. వసుచరిత్రమునకుఁ దరువాత నీతనికవిరాజ మనోరంజనములో నుతూఁగఁదగిన ప్రబంధము లొకటి రెంటికంటె నెక్కువగాలేవు. కవిరాజమనోరంజనములోని యీక్రిందిపద్యమువలనఁ గవి సాహిత్యమునందుమాత్రమే కాక సంగీతమునందును బ్రవీణుఁ డయినట్లు కనఁబడుచున్నాఁడు—

క. శ్రీమంగళగిరినరసిం। హామేయకృపావిజృంభితాద్భుతకవితా
శ్రీమంతుఁడఁ గానకళా। ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్.

కవిరాజమనోరంజనమునకుఁ బురూరవశ్చరిత్రమని నామాంతరముగలదు. బాల్యము నందు రచింపఁబడినదగుటచే ననిరుద్ధచరిత్రము పురూరవశ్చరిత్ర మంత ప్రౌఢముగా లేదు. ఈరెండు పుస్తకములనుండియుఁ గొన్ని పద్యముల నుదాహరించుటకన్నఁ గవి విషయమున వ్రాయఁదగిన విశేషాంశము లేవియుఁ గానఁబడవు.

అనిరుద్ధచరిత్రము.

చ. విచికిలగంధియుక్ విభుఁడు వేడుకతోఁ దర రెండువైపులన్
రుచిరకటాక్షపంక్తులమెఱుంగులు నిండఁగ నిల్పి రయ్యెడన్
బ్రచురతరానురాగరసబంధురతం దరచీర దూరి పా
లుచు హృదయాబ్జమూల్ మొగ మెఱుంగనిచుట్టితకంబు సేయఁగన్.—అ౧

ఉ. కన్నులఱెప్ప లాఁగనివికాసపుఁజూపును మానముద్రతో
నున్న మొగంబు నిశ్చలత నొప్పుశరీరముఁగాఁ బటంబుపై

నున్నతలీల వ్రాసినప్రియుం గని సొక్కెనఁ దాను నట్లతాం
జొన్నలు చక్కెయుండె సఖి చేసినజంత్రపుబొమ్మకైవడిన్.—అ. ౨.

ఉ. మీసముతీరుఁజూచి జిగిమేనిపటుత్వముఁజూచి మోములో
హాసముఁజూచి చేతులచొయారముఁజూచి మనోజ్ఞరూపరే
ఖాసమలీలఁజూచి యహహా యనుచుం దలయూఁచి ముందు తా
వ్రాసినభావ మెంచి తల వంచుకొనెం జలజాక్షి సిగ్గునన్.—అ. ౩.

చ. అనవుడు మందహాసముఖుఁడై హరి నీభుజశక్తి నీవె నె
మ్మనమున లజ్జలేక పలుమాఱును మెచ్చుకొనంగ నీతితో
యనిమొన జెల్చినప్పుడు నిరర్థక మీవెడమాట లేల నాఁ
డావి భుజాయుధంబు చను పోవుచును గూరలమే లనుగంగ నేటికిన్.—అ. ౪.

ఉ. భూసురవేదనాదములఁ బుణ్యసతీజనమంజులోక్తులన్
భాసురవృత్తగీతరసబంధురరావములం బురీవనీ
వాసశుకానులాపముల వారణబృంహితవాజిహేషలన్
ఘోషముదంచితం బగుచుఁ జెల్వ వహించెఁ బురంబు నవ్యమై.—అ. ౫.

కవిరాజమనోరంజనము.

చ. కొడుకులు గల్గుదాఁక నొకకొన్నిదినంబులు చింత నందనుల్
పొడమిన నాయువున్బలము బుద్ధియు విద్యయుఁ జాలఁ గల్గఁగా
నుడుగనిచింత కల్గి తను నొలిభజింపనిచింత తండ్రి కె
ప్పుడుఁ గడుచింత సేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే.—అ. ౧

సీ. ధవళ వల్పులకుఁ బ్రభుత్వంబు వచ్చిన మనుష్యుల వికారపుఁజూడ్కిఁ జూచినట్లు
పల్లవు ల్పుత్తి లేమిపడి యింటిచాయరా మొగిలంజెతల్లులు మూల్గినట్లు
పరదేశి యతిలోభపరునియింటికిఁ బోవఁ దగి కోఁతివలెను గద్దించినట్లు
పంతువానికి హీనవైశ్యులు తమలోన శోకంబుగాఁ గలహించినట్లు
తెరలి కొండొకకుటివి కూశ్మదృష్టిఁ జూచు
గొఱగొ అను ఘూర్లు గద్దించుఁ దతిమి తతిమి
కవిసి కలహించి ఘోశ్యతి కలకలముగ
కాకులున్నవి రోమభీమణతు లగుచు.—అ. ౨.

చ. కర మనురక్తిఁ గొమ్మ కరకంజమునం దిడి మీఁదఁ బాలుఁ జ
క్కెరలును బెట్టి పెంచి పఠింపుచు మాటలు చెప్పినందుకా

విరసతఁబూవుల న్నిగుల వేదన గొల్పెద రింతి కిర్యాదకా
గుబుగుబు బొమ్మపెట్టితిరి క్రూరవిచారము కీరవాగమా.—అ. ౩.

ఉ. నిప్పులురాలు గ్రీష్మమున నిక్కినగాడ్పులు వార్షికంబునన్
జప్పుడు సేయుకే మరలఁబోఁగాఁ బ్రతీచికిఁ బ్రాచినుండి తా
రప్పటిపోరగుచేఁ బ్రజల నాపదఁ బెట్టి నిబాధికారముల్
దప్పినఁ జిన్నబోయి మరలం జనుచుందురుగాద దుష్ప్రభుల్.

చ. మలయజగంధి తాళపరిమాణమనోహరరాగగీతికా
కలరవదంబు జంత్రమున గాత్రమునన్ జెలఁగింపు నింపుచే
శిలలు ద్రవించెఁ జిత్రములు జీవకళల్ ధరియించె దారువుల్
పొలుపుగ నంకురించె మృగము ల్మదిఁ జొక్కవహించె నెంతయున్.—అ. [illegible]

మ. తగునే రాజకుమార మన్మథ మనస్తాపంబుచే నింత నె
వ్వగలం బొందఁగ ధైర్యశాలివిగదా వారాంగనాస్నేహమో
హగుణంబు ల్చపలాయతాయతము లెంతైన న్నతం బేలగున్
నగరే లోకులు నీమనం బిటులు మగ్నంబైన రాగాంబుధిన్.—అ. ౫౬.

## కాణాద-పెద్దన సోమయాజి

ఈకవి నిజామురాజ్యములోని గద్వాలసంస్థానాధిపతి యైన ముక్కిపల్లి సోమ భూపాలుని ప్రేరణచేత ముకుందవిలాసమును, అధ్యాత్మరామాయణమును రచియించెను. ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; అశ్వలాయనసూత్రుఁడు; ఆత్రేయ గోత్రుఁడు; తిమ్మనార్యపుత్రుఁడు. సోమభూపాలుఁడు తన్నుఁగూర్చి పలికినట్లు కవి చెప్పుకొన్న ముకుందవిలాసములోని యీక్రిందిపద్యములలో „శేషశైలేశలీల'' అను నామముతో అపంచవర్గీయ చిత్రకృతి మొద లయినవానినిగూడఁ దాను రచించినట్లు చెప్పెనుగాని యవి యిప్పుడు కానరావు—

సీ. నను నందవరపురాన్వయపయోనిధిచంద్రుఁ గాణాదవంశవిఖ్యాతిసాంద్రు
నాశ్వలాయనసూత్రు నాత్రేయమునిగోత్రు సకలవిద్వత్కవిప్రవరమిత్రు
ప్రౌఢలక్ష్మీపతిపండితసోదర్యు బాహటగ్రంథానుభావధుర్యు
వేదశాస్త్రపురాణవివిధమతధురీణు వరచతుర్విధకవిత్వప్రవీణు
భోజచంపూప్రబంధార్థబోధనాన్ధ్రబంధగీర్వాణటీకానిబంధనాది
[illegible]రచనచతుర్యు పెద్దనార్యుఁ గాంచి దయమించి పలికె సగౌరవముగ,

గీ. కాదివర్ణంబు లిరువదియైదు విడిచి । చేసితి పవర్గీయచిత్రకృతిని
శేషశైలేశ లీలాఖ్యచే నెసంగ । యాదిమితవర్ణనియతి శక్యంబు జగతి?

ఉ. శ్రీరమణీయరత్న సూరపురీనగరీసగరీయదేశభూ
భారధురీణుఁ డాబిహారిపామనృపాలుసభాంతరంబునన్
యూరమణాంకితంబులుగను మత్స్యపురాణ మొనర్పఁ బూనవే
సారసుధాప్రసారవిలసత్కృతి నాంధ్రవచశ్చమత్కృతిన్.

ఈకవి సంస్కృతాంధ్రములయందు బహుసమర్థుఁడు. ఈతనిగ్రంథములలో నున్నన్ని శబ్దాలంకారములును చిత్రబంధకవిత్వపద్యములును మఱి యేకవిగ్రంథములోను లేవు. ఈతనికవనము రసవంతమయి కవిజనహృదయరంజకముగా నుండును. తనకవిత్వముఁ గూర్చి వెన్నెలకంటి వేంకటపతి యీక్రిందిపద్యమును జెప్పినట్లు కవి తనయధ్యాత్మ రామాయణమునందు వ్రాసికొనియున్నాఁడు—

ఉ. ఇద్దఱుజోడు నన్నకవి యెఱ్ఱన, తిక్కన సోమయాజి దా
నద్దగు వాఁడికిన్, ముగురి కొక్కఁడె దీటగు నల్లసానిమా
పెద్దన, వారితోడుతను బేరువహించిన శ్రీకణాదముం
బెద్దనసోమయాజి విను పెద్దనఁ బోల్పఁ గవిత్వసంపదన్.

ఇట్లితరులు పొగడినట్లు చెప్పుటయేకాక కవి తాను తనముకుందవిలాసము నిట్లు పొగడుకొన్నాఁడు—

గీ. ఇందు సకలహితము నిచ్చు మున్విష్ణుఁడి । త్రీయతుల్యమౌ మదీయకవిత
యెదుటఁ జేవఁబోలు వనలిఁబోలుఁ బోలు నొమోను । మృదువుగాద విరులమీఁద వాలి?

క. కుందవిలాసము తావి ము
కుందవిలాసము సదాముకుందవిలాసం
బిందువిలాసమును సుధా
బిందువిలాసము హసించుఁ బేశలఫణితిన్.

ఈకవికాలముగాని కృతిపతి యనఁదగు పెదసోమనృపాలునికాలముగాని నిశ్చయముగాఁ దెలియలేదు. అయినను

ఉ. వెన్నయభట్టు భీమన ననంతు నధర్వణుఁ దిక్కహోత్రి నె
ఱ్ఱన్నను సోము భాస్కరుని నయ్యలు నైషధకావ్యకర్తఁ బో
తన్నను చిన్నవీరుఁ జివన్నను నూరప రామభద్రుఁ బె
ద్దన్నను దిమ్మనార్యు గరుడాంకుని మూర్తి సుకీర్తి నెంచెదన్.

అని భట్టుమూర్తివఱకును గలకవుల నీకవి పొగడి యుండుటచేత నీతఁడు పదునాఱవ శతాబ్దాంతమునకుఁ బదునేడవశతాబ్దాదికిని దరువాత నుండెనా యనుట స్పష్ట

మగుచున్నది. ముష్టిపల్లి సోమనృపాలునితాత మొదలయినవారు మహమ్మదీయులతో యుద్ధము చేసి వారిని జయించుట మొదలయినసంగతులు చెప్పఁబడి యుండుటచేత నితఁడు పదునేడవశతాబ్దాంతమునందో పదునెనిమిదవ శతాబ్దారంభమునందో యున్న టూహింపఁ దగియున్నది. గద్వాలసంస్థానమునందున్న మామిత్రులొకరిఁ గవికాల విషయమునుగూర్చి వ్రాయుఁగా ౧౮౫౦వ సంవత్సరప్రాంతములయం దుండినట్లు తెలిపి యున్నారు. ఇందలికవిస్తుతిలోఁ బేర్కొనఁబడినయయ్యలు కట్టమతమును జేసి సత్యదే యయినపక్షమునఁ గవి ౧౮౭౦వ సంవత్సరమునకుఁ దరువాతఁగూడ నున్నట్లు చెప్పవలసి యుండును. ముకుందవిలాసమునకు భద్రాపరిణయ మని నామాంతరము గలదు. కవికృతము లయినరెండుగ్రంథములనుండియుఁ గొన్నిపద్యము లిం దుదాహరింపఁబడుచున్నవి—

ముకుందవిలాసము.

ఉ. ఆటలు పాటలుం గలుగునందపుగందపుఁగూటవాటముల్
కోటలు పేటలుం బసిఁడిగోడలు మేడలుఁ గల్గవిందురా
చోటులు నీటులుంగులుకుచుక్కను జుక్కను నిందుఁజెల్వపుం
బోటులమేటులం దగినపొన్నలచెన్నులు గల్గువీటిలోన్.—ఆ. ౧.

ఉ. చేరలఁ గొల్వవచ్చు దయచిప్పలఁ గొప్పకుఁ గొప్పకన్నులున్
మూరలఁ గొల్వవచ్చుఁ గడుముచ్చట లిచ్చువెడందవక్షమున్
బారలఁ గొల్వవచ్చుఁ గచపాళి బళీ హరికి న్సమీపమున్
మేరలఁ గొల్వవచ్చు నిఁక మేలతఁ డీలతఁ బ్రీతిఁ జేసినన్.—ఆ. ౨.

ఉ. కానన కాననభంబు సరి కాని జగావిలసిల్లు మోహకిం
పానఁగఁ బానకంబు సమ మానన మానసవిల్లు మేసమా
మే ననమేనసం గనక మేనన మీనసఁగన్గవం దగున్
వేలిలివేనలిన్విరుల వేయుఁ జూవె యువతీమతల్లికిన్.—ఆ. ౩.

మ. తనరన్ వ్యాకరణజ్ఞుఁ డంద్రియనుచుం దర్కజ్ఞునిన్ బ్రాభయం
బును మీమాంసకునిన్ నపుంసకుఁ డటంచు న్వాడి దూరంబునం
గని యస్పృశ్యునిఁ బోలె ఛాందసుని వేడ్కం గావ్యలీలారస
జ్ఞ నిజేచ్ఛం గవితావధూమణి వరించున్ భావగర్భంబునన్.—ఆ. ౪.

అధ్యాత్మరామాయణము.

సీ. సంసారదావాగ్నిసంతప్తులకు సుధాస్తోమవర్షనియుక్తి రామభక్తి
తాపత్రయాతురతాపక్షీణితులకు రమ్యభేషజయుక్తి రామభక్తి

మందమతిపాపపటలదర్పము నణచు రచితగారుడశక్తి రామభక్తి
వివిధదుర్వారశిఖాంతభీతులకును ప్రబలశక్తియు శక్తి రామభక్తి
ప్రేమపోషితగురుసామ్య శక్తి రామభక్తి । కామితార్థప్రదాన శక్తి రామభక్తి
శ్రీమదానందప్రదమగు శక్తి రామభక్తి । సామరస్యోదితవిముక్తి శక్తి రామభక్తి.—బాల.

చ. సొరిది గళత్రపుత్రపితృసోదరబాంధవముఖ్యసంగమం
బరయ నదీప్రవాహపతితాగతకాష్ఠములట్లు కూడుచున్
బెరసెడుని నైజము ప్రవాహగతజంతులచాలి మోహముల్
జొరయక యుండఁగావలయుఁ బోవుచునున్నదవచ్చుచున్నదన్.—అయోధ్యా.

ఉ. అంతట దైత్యకాంతుఁడు సురాదివిరోధి సరోధిదాటి య
త్యంతవిభాకలంకను శుభాంకను లంక నశోకకానసా
భ్యంతరసీమలో నిలిపె నాసురకాంతలు కాచియుండఁగా
సంతతపూత సాధుగుణజాతను నాశ్రితజాత నెంతయున్.—అరణ్య.

ఉ. అంచలుపాఱెఁ గేకులకు నాటలు గేరె ఘనంబు లూరెఁ గ్రౌ
మ్మించులుకూరె శీతలసమీరమువారె మరుండు చేసె ము
న్నుంచుగ జాతిబాణతతి మానె నటం బధికాళిధైర్యముల్
గ్రించుకజాఱె మాఱె నలగ్రీష్మము మీఱె జలాగమం బిలన్.—కిష్కింధా.

చ. కమలవిరోధి కామజయకారి కిరద్యుతికీర్తనీయుఁడున్
కుముదహితుండు కూటమృగగోత్రహితాంతుఁడు క్లృప్తసత్కళా
క్రముఁడును కేశవేక్షణము కైరవిణీశుఁడు కోకభేదనా
గమనుఁడు కామదీకరుఁడు కంధిభవుం డుదయించెఁ దూర్పునన్ —సుందర.

ఉ. దానవనాశనార్థముగఁ దత్సతిఁ దెచ్చితి వీవును సమా
మానము నామిషంబునుతమిన్ విముఖుండవు ప్రోసెసాలు నా
ట్లానతి నామభీషణసుతాకారణం బోసఁగూడె మీఁదటన్
గా నగునట్టి కార్యము మనిశానగుచున్నది దానవాగ్రణీ.—యుద్ధకాండము.

మ. శ్రవణానందకరంబు సుందరముగా షడ్జాదిసప్తస్వరా
ర్ణవమున్ జాతిగతుల్ త్రికాలకలితస్థానత్రయీయుక్త మా
ర్గవిధుల్ తోఁపఁగ వల్లకీచతురతన్ రంజిల్ల గాంధర్వసా
రవిదుల్గానము సేసి రా కుశలవుల్ రామాయణం బాసభన్.—ఉత్తరకాండ.

## కుందుర్తి వేంకటాచలకవి.

ఈకవి మిత్రవిందాపరిణయమనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచియించెను. ఇతఁ డాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శాండిల్యగోత్రుఁడు; రామయామాత్యపుత్రుఁడు. ఈతని తాతయైన గోవిందామాత్యుఁడు ౧౬౫౦ వ సంవత్సరప్రాంతములయందు రాజ్యముచేసిన వీరవేంకటపతిరాయలవద్ద నుండి, భారతీపరిణయమను కావ్యమునుజేసి యాతనిని మెప్పించినట్లు కవి యీక్రింది పద్యమునఁ జెప్పియున్నాఁడు—

చ. పటుతరగోష్ఠి నీమధురపాకసమంచితమై రసోర్జితప
ద్యటమగుభారతీపరిణయం బనుకావ్య మొసంగి వీరవేం
కటపతిరాయలం దనిపి కాంచె మణీకనకాభిషేక ము
త్కటగతి నమ్మహామతి సుఖస్థితిశోభి యశోభిరాముఁడై.

ఈకవికాలమునాఁటికి విజయనగరసంస్థానప్రభువులు మిక్కిలి హీనదశకువచ్చినందునఁ గవి ఈరాజ్యమునువిడిచి పాండ్యమండలమునుజేరి మధురలోనుండినట్లు తెలియవచ్చుచున్నది. గ్రంథావతారికలోఁ దాను పాండ్యమండలాధీశ్వరుఁడయిన విజయరంగచొక్కనాథునిఁ గవిత్వముచెప్పి మెప్పించినట్లు కవియే యీక్రిందిపద్యములలో వ్రాసికొనియున్నాఁడు—

సీ. చదివినావే మేమి చదువయోగ్యంబులో యవియెల్ల నిస్సంశయంబుగాఁగ
వచనకావ్యములుగా రచియించినావు భారతభాగవతములు రామకథయు
ఘటియించినావు ద్రాక్షపాకముగ బహునాటకంబులు సమున్నతిఁజెలంగఁ
జాటించినావు దిక్కోటరంబుల బుధకోటిమెచ్చ నపారచాటుకృతులు
నర్థగుంభనముజ్జృంభితాశుమధుర । చిత్రవిస్తరకవితా ప్రసిద్ధి నీకు
సహజమేకద పాండ్యభూజానిసభఁ గ । ధాశుకవియనఁ గీర్తిఁ జెన్నలరినావు.

చ. కవిజనకల్పకం బఖిలకావ్యరసజ్ఞుఁ డఖండపాండ్యభూ
ధవుఁడు మహామహాప్రభుఁ డతిధార్మికుఁ డర్యగవ్రజధారి యై
న విజయరంగచొక్కనరనాథుఁడు నీకవితాసమగ్రవై
భవములు మెచ్చి నీ కొసఁగె భర్మమణీశిబికాదిసంపదల్.

పయిపద్యములవలనబట్టి యితఁడు కొన్నినాటకములనుమాత్రమేగాక భారత భాగవత రామాయణములను వచనకావ్యములుగాఁగూడ రచియించినట్లు విశదమగుచున్నది.

ఇతఁడుమాత్రమేకాక యితనికాలమునం దుండినయితరకవు లనేకులుకూడఁ దావచనకావ్యములను రచియించినట్టు తమ ప్రబంధములలోఁ వ్రాసికొనియున్నారు ఆవచనకావ్యము లన్నియు మాకు దొరకకపోయినను, ఈకాలములోఁ రచియింపఁబడిన వచనకావ్య మొకటిమాత్రము మాకు లభించినది. ఆవచనకావ్యమునుగూర్చియుఁ దత్కర్తనుగూర్చియు నింతకుముందే కొంత వ్రాయఁబడెను. పయి నుదాహరింపఁబడినవానిలోని కడపటిపద్యమునుబట్టి కవికాలమునుసహితము స్పష్ట మగుచున్నది. విజయరంగ చొక్కనాథుఁడు ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసి విద్వాంసుఁడై యాంధ్రకావ్యరచనను బ్రోత్సాహము చేసినవాఁడగుటచేతను, అతనికాలములోనే కవి యనేక గ్రంథములనుజేసి తర్వాతమిత్రవిందాపరిణయమును జేసియుండుటచేతను, ఇతఁడు హూణశకము ౧౭౪౦వ సంవత్సరప్రాంతమువఱకును జీవించియున్నట్టు తెల్లమగుచున్నది. కొంతకాలమునుండి యీతని పూర్వకవు లాచరించుచువచ్చిన యాచారమును మానక యీకవియు రంగనాథుఁడు తనకు స్వప్నమున సాక్షాత్కరించిన ట్లీక్రిందిపద్యమున వ్రాసికొనియున్నాఁడు. —

సీ. నీలమేఘముడాలు చాలునించఁగఁజాలుమేనువాఁడు జగంబు లీనువాఁడు
వేల్పురాతాల్పు విప్పటందమదల్పుటొమ్ము వాఁడు కళాభరమ్ము వాఁడు
వెలలేనిబంగారు వేవన్నెరంగారుచేలవాఁడు మనోజ్ఞలీలవాఁడు
కడకంట సొంపారుకరుణారసముమీఱుచూపువాఁడు భవంబుఁబాపువాఁడు
హీరకటకకిరీటకేయూరతార । హారమంజీరచాకచక్యములవాఁడు
కలనొకానొకపురుషుఁ డుత్కలికదొలుకఁ । బ్రేమ నామ్రోల వేకువజామువేళ.

గ్రంథమునం దక్కడక్కడ లక్షణవిరుద్ధము లైనప్రయోగము లనేకము లుండుటచేత నీతఁడు లాక్షణికకవి కాకపోయినను, మొత్తముమీఁద నీతనికవిత్వము రసవంతము గానే యున్నది. మిత్రవిందాపరిణయములోని రెండుమూడుపద్యముల నిం దుదాహరించుచున్నాము.—

చ. అని వనితోక్తియుక్తిగతి నవ్వని జవ్వనిగుంపు సొంపుఁ జే
కొని తనిజాతసౌరభము గ్రోలుచు సోలుచు మిన్నగన్న క్రొ
వ్వన లనవద్యహృద్యకల నన్గని కన్గొని తావిమావి పెం
పొనరినమేరఁ గీరరుతు లూకొని తూకొనినంత నింగనా. — అ. ౧.

మ. సారస మామొగంబు జితసారస మాగమనంబు నాభికా
సారససూభ మాకచము సారసమాజము మేఘ మానుధా

సారసమావృతంబు నడి సారసమానము తన్నుతంబ మా
సారసమానసీయనుభసారసమాయత మాద్యగబ్జముల్. — అ. ౮.

చ. కనియె నుదారుఁ బాయతరకాస్తు భహారు సుమేరుధీరు జీ
వనదశరీరు దుగ్ధమయవార్ధి గభీరు దురాపసారు లో
చనసుఖదావతారు ఖలశైలశతారు నఘౌఘమూరు స
న్మునతయశోవిహారు వసుదేవకుమారు నతాబ్జనాభునిన్. — అ. ౬.

## ఈదురుపల్లి — భవానిశంకరుఁడు.

ఈకవి ధర్మఖండమును రచియించెను. ఇతఁడు కూచిమంచి తిమ్మకవితోను కవ్వలంక వీరభద్రకవితోను సమకాలికుఁడయినందున, ఇతఁడును పదునెనిమిదవ శతాబ్దారంభమునుండి ౧౭౫౦ వ సంవత్సరప్రాంతములవఱకును జీవించియుండును. ఈకవి తనధర్మఖండమున వక్కలంక వీరభద్రకవినిగూర్చి వ్రాసిన 'హరిశౌర్యుండగు' అనుపద్య మీవఱకే యుదాహరింపఁబడియున్నది. దిట్టకవి వేంకటరాయకవి తన విద్యాగురుఁడైనట్లు కవి ధర్మఖండమున నీక్రిందిపద్యముచేఁ జెప్పుకొనియున్నాఁడు —

ఉ. శ్రీమయవాగ్విలాసుఁడు నశేషలిపిప్రవణుండు భూతల
భ్రామహనీయమూర్తియుఁ బ్రబంధనిబంధనబంధురక్రియా
భామహితోరుసూత్రుఁడు నృపాలకపూజ్యుఁడు నంచుఁ దన్బుధుల్
వేమఱు నెంచ దిట్టకవి వేంకటరాయకవీంద్రుఁ డొప్పగుచ్.

ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; శంకరామాత్య పుత్రుఁడు. కవి తాను శృంగారమంజరి యనుకావ్యమునుగూడ రచించిన ట్లీక్రింది పద్యమునఁ జెప్పుకొనెనుగాని మా కాగ్రంథము లభింపలేదు —

సీ. ధాత్రి భారద్వాజగోత్రపవిత్రుఁడై సుకుచిరాపస్తంబసూత్రుఁ డగుచు
నిరతాన్నదానాభిరతుఁడౌ నీదురుపలి నరసామాత్యుపౌత్రవరుని
నగగపూజితశంకరుం డగుశంకరామాత్యుకుఁ బెద్ద సాత్మభవునిఁ
బ్రాజ్ఞుని నచ్చమాంబాగర్భశుక్తిముక్తామణి నీశ్వరధ్యానవిరతు
భవ్యశృంగారమంజరీకావ్యరత్నని మంత్రభాష నొనర్చినయనఘచరితు
శంభువిభుఁడై నయియుఁటూరి శంభులింగ్య! నను భవానీశనామునిఁగన్గొనుచుఁ బ్రోచి.

ఈకవి రచియించినగ్రంథము సమగ్రముగా దొరకలేదు గాని దొరకినంతవఱకు

గవనము రసవంతమయి మధురమయి నిర్దుష్టముగానున్నది. ధర్మఖండమునుండి రెండు మూడుపద్యముల నిందుదాహరించుచున్నాను—

చ. అనవిని వానిఁజూచి మునులారయఁ బుత్రకళత్రరక్షకై
యనయముఁ గ్రూరవృత్తిమెయి నర్థము నీవు గడించెదేని నీ
ఘనతరమైనకిల్బిషనికాయము భాగమువారు కొందరో
కొనరో యెఱుంగఁదెల్పు మనిఖండితలీల నటంచుఁ బల్కినన్.

చ. హరి భజియింపనైతి లలనావయవామితవర్ణనాప్తి న
స్థిరమతి నర్థలోభరతిఁ జేయఁగనైతిఁ బరోపకార మి
ద్ధర శతతాదయాకలితతాగుణము ల్సహజంబు లయ్యె నె
ట్లరయుదు నీయపారకలుషాబ్ధికిఁ దారణయానపాత్రమున్.

చ. ఫలితతరుల్ ద్విజాతులకు భక్తి నొసంగుటయున్ గతోదక
స్థలములఁ బ్రాణిలోకము హితంబునకై సరసీతటాకముల్
నిలుపుటయున్ మహాత్ములకు నెంజిలి దీర్చుటయున్ దలంప నీ
యలఘుసుకర్మపంక్తులు తదవ్యయమార్గసుఖైకహేతువుల్.



## ధూర్జటి–వేంకటరాయకవి.



ఇతఁడు రత్నావళీపరిణయ మనెడు నాలుగాశ్వాసముల ప్రబంధమును రచించి చేకూరి రామస్వామిమంత్రి కంకితము చేసెను. ఈకవి కాళహస్తిమాహాత్మ్యమును రచియించి కృష్ణదేవరాయనికాలములో నుండినధూర్జటికవివంశమువాఁడు. ఇతఁడు తన గ్రంథమునందు ధూర్జటికవి నిట్లు స్తుతించి యున్నాఁడు—

మ. పటుగంగాలహరీతరంగసమశుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘుటనున్ బాదవినమ్రకృష్ణనరరాడ్గంభీరకోటీరవి
స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకులకర్తన్ భక్తి రంజిల్లఁగన్.

ఈధూర్జటిపౌత్రుఁ డయిన వేంకటపతి కృష్ణరాజవిజయమును జేసెను. ఈవేంకటపతి కుమారుఁడును కవితండ్రియు నైనలింగరాజు కాళహస్తిరాజుల ప్రేరణముచేత మఱియొక పెద్దకాళహస్తిమాహాత్మ్యమును రచియించెను. రత్నావళీపరిణయమునఁ గవి తన తండ్రినిగూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు—

మ. ఘనగారీశకటాక్షలబ్ధకవితాగాంభీర్యసంతుష్టభూ
జనరాడ్దత్తసువర్ణచేలమణిభూషాగ్రామపల్యంకికా
ఘనదంతావళఘోటకాదిబహుసత్కారప్రతిష్ఠాత్ము మ
జ్జనకుఁ ధూర్జటి లింగరాజకవిరాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్.

ఈకవి పాకనాఁటి యార్వేలనియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు. ఇతఁడు తన్నుఁగూర్చి చెప్పుకొనుచుఁ దా నింతకుమున్న నామలింగశాసన మనఁబడెడి యమరమునంతను బద్యకావ్యమునుగా రచించిన ట్లీక్రిందిపద్యములలోఁ దెలిపియున్నాఁడు—

చ. స్థిరముగఁ గాళహస్తిగిరిజేశవరాగతసంస్కృతాంధ్రసుం
దరకవనంబు వ్యాకరణనాటక కావ్యవిచక్షణత్వముల్
గరిమవహింప భూవరశిఖామణు లెన్నఁ జెలంగి తార బం
ధురతనుకాంతిబాలరవి ధూర్జటి వేంకటరాయసత్కవీ.

మ. అమరం బంతయుఁ బద్యకావ్యముగ భవ్యంబైనయయ్యంధ్రభా
ష మహాపండితసత్కవివ్రజము మెచ్చన్ సాహితీకౌశల
క్రమ మొప్పన్ దృఢభక్తితోడుతను శ్రీరామాంకితంబై తగన్
రమణీయంబుగఁ జేసినాఁడవు బళీ ప్రఖ్యాతివాటిల్లఁగన్.

ఈకవి కాలనిర్ణయమునుగూర్చి కొంచెము విచారింపవలసియున్నది. ఈతనితండ్రియైన లింగకవి తాను రచించిన పంద్రెండాశ్వాసముల కాళహస్తిమాహాత్మ్యమును కాళహస్తి రాజయినదామెర్ల యక్కప్పనాయనిపుత్రుఁడగు వేంకటపతిరాయని కంకితముచేసియున్నాఁడు. అక్కప్పనాయనిపుత్రుఁడయిన వేంకటపతినాయఁడు పదునేనిమిదవ శతాబ్దారంభమున నుండినవాఁడు. దీనినిబట్టి యీకవి ౧౫౫౦ వ సంవత్సర ప్రాంతమునం దుండినట్టు నిశ్చయింపవలసి యున్నది. అయినను మన మిప్పుడునిర్ధారణము చేసిన యీకాలమున కొక బాధకము కనఁబడుచున్నది. కవితండ్రి యైనలింగకవి తన కాళహస్తిమాహాత్మ్యమునందు

సీ. శ్రీకాళహస్తీశసేవనాన్వితచిత్త చిత్తజాకర లక్ష్మీవిహార
రమణీయశీల భారద్వాజగోత్రపవిత్ర యాపస్తంబసూత్రమహిత
ధూర్జటివంశపాథోధిచంద్ర కుమార ధూర్జటినామ విస్ఫూర్జితాంక
స్తుతమతి వేంకటపతితనూభవ లింగరాజకులేంద్ర ధైర్యాచలేంద్ర"

అను సీసపద్యములోఁ దాను కృష్ణవిజయము నొనర్చిన కుమారధూర్జటికిఁ బుత్రుఁడయినట్టు వ్రాసికొనియున్నాఁడు. ఈకుమారధూర్జటి తాను కృష్ణదేవరాయలకాలములో నుండి కాళహస్తిమాహాత్మ్యమును రచించిన ధూర్జటికవికి మనుమఁ డైనట్టు తనకృష్ణ

ఉ. చందురువంటి నెమ్మొగము చాఁగెఱుకన్నులు వృత్తదంష్ట్రముల్
సుందరపల్లవాధరము సోగకురు ల్మణికుండలప్రభా
బంధురకర్ణయుగ్మము బారెఁడుచేతులుఁ గల్గు రాము నిం
పొందఁగఁ జూచుకున్న నిలుపోపఁ దరంబె సుమంత్ర యుత్తటిన్.—అయో.

చ. ఇనకిరణాళికిం జొరవ యీక సదాగతిరాక కైనఁ బ
ల్చనపడ కర్థి సైకతముఁ జల్లి రాలఁగనీక దట్టమై
దనుజవిముక్తకాండములఁ దట్టుచు దిక్కుల రామకాండముల్
సునిసితభంగి నిండుటయుఁ జూచి సుర ల్వెఱఁగంది రయ్యెడన్.—అరణ్య.

ఉ. భూవరవర్య యెవ్వని సముద్ధతిఁ జంపుటకై కడఁగి సు
గ్రీవునితోడ నెయ్య మొనరించి తదీప్సితసిద్ధిఁ గోరి న
న్నీవిధిఁ జంపి తట్టిదనుజేంద్రుని రావణుఁ గీటడంచి నీ
దేవిని నెందు డాఁచినను దెచ్చియొసంగనె యొక్కవ్రేల్మిడిన్.—కిష్కింధా.

ఉ. ఓరిదురాత్మ యిందు బుధు లుండరొ యుండిన నీవు వారలం
జేరవొ సాధువాక్యములు చేకొన నొల్లవొ శిక్షలేమి నా
చారవిహీనమై సకలసజ్జనగర్హిత మయ్యె నీమతం
బారయ నీకతంబున నిశాటకులంబు చెడు న్నిజంబుగన్.—సుందరకాం.

మ. మఱియున్ రావణి సాయకంబులు ధనుర్మౌర్విం దగంగూర్చి బ
ల్గులాడం దెగనిండఁదీసి వెస వక్షం బుచ్చిపో నేసినన్
గురుబాణక్షతజాతరక్తకలితాంగుండై సుమిత్రాసుతుం
డరయం బొల్చె విధూమవహ్నిగతిఁ బుష్పాఢ్యద్రుమప్రక్రియన్. యుద్ధకాం.

కృష్ణజన్మఖండము.

చ. సలలితశుద్ధతోయములు చారుమణీదళపద్మకైరవో
త్పలములు గంధలుబ్ధకసుతానమధువ్రతగీతనాదముల్
కలరవచక్రకుక్కుటమరాళమనోహరమంజుశబ్దముల్
గలిగి మనోజ్ఞసంపదలఁ గ్రాలు విశాలసరోవరం బొగిన్.—అ. ౩.

మ. పరికింపం గడు దుర్లభం బవనిలోఁ బ్రాణేశకాంతామణీ
పురుషప్రేమగుణాతిరిక్త మనిశంబుం బూతచారిత్రయున్
స్వరసారజ్ఞయు సాధ్వియున్ రసికయున్ జాతుర్యసంయుక్తయౌ
తరుణీరత్న మెఱుంగు సత్పురుషుఁడున్ దథ్యంబు చింతింపఁగన్.—అ. ౫.

శిశుపాలవధము.

శా. సామర్థ్యంబున మాఱులేనిబల మస్యం బబ్ధి న్నీతివి
ద్యామర్యాద నెఱింగి పోవుబల మస్యం బిట్టు లీరెంటికిన్
నేమం బేర్పడ భూరితేజమునకుం జీఁకట్లకుం బోలె బ
ల్సామానాధికరణ్య మెట్లు గలుగున్ జర్చింప లోకంబునన్.—ఆ. ౧.

చ. అలఘుధనుష్ప్రభావము గుణాతిమహత్త్వము ముష్టిశక్తియో
యిలయు దిగంతముల్ గగన మీనుచు నున్నవొ యేమిచిత్రమో
తెలియఁగరాదు శౌరిసముదీర్ణశరంబులు చిత్తజల్లుల
ట్లలవడ నొక్కరీతిఁ గురియం దొడఁగెన్ ధ్వనిపూర్వకంబుగన్.—ఆ. ౪.

భగవద్గీత.

ఉ. మెండుగ వృష్టికాలమున మిన్నకపాఱునదీప్రవాహముల్
నిండి చలింపకున్న యలనీరధిఁ జేరినమాడ్కి నెవ్వనిం
దండిగ సర్వకామములు తప్పక చేరు నతండు శాంతుఁడై
యుండు సకాముఁడైనరుఁ డొందఁడు శాంతిని పాండునందనా.

చ. అలయక యోగు లీతనిఁ బ్రయత్నము సేయుచు నాత్మయందు ని
శ్చలముగ నున్నవానిఁగ నిజంబు నెఱుంగుదు రజ్ఞులైన ని
శ్చలమతిహీనులొక్కమొగిఁ జాలఁ బ్రయత్నము చేసియున్ సము
జ్జ్వలుఁ డగునీశ్వరుం దెలియఁ జాలరు భారత నిక్కమింతయున్.



